జూన్ 2007  Rs. 13 /-

# చందమామ

60 సంవత్సరాలుగా విజ్ఞాన వినోదాలు విరజిమ్ముతూన్న విశిష్ట పత్రిక!




# అరవైయేళ్ళకు పైగా...

తెలుగు, తమిళ భాషలలో 1947 జూలైలో ప్రారంభించబడిన మీ అభిమాన మాసపత్రిక చందమామ జూన్ 2007 సంచికతో 60 సంవత్సరాలు పూర్తిచేసుకుంటోంది!

చందమామ ప్రస్తుతం తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, హిందీ, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, ఒరియా, సంస్కృతం, అస్సామీ, సంథాలీ మొదలైన 12 భారతీయ భాషలతో పాటు ఇంగ్లీషులోనూ వెలువడుతోంది. ఒక గిరిజన భాషలో వెలువడుతూన్న మొట్టమొదటి పిల్లల పత్రిక చందమామ!




9 సంవత్సరాలలోపు పిల్లలకు ప్రత్యేకంగా జూనియర్ చందమామ 2003 నుంచి వెలువడుతోంది.

దేశ విదేశాలలో కంప్యూటర్ ప్రియులైన మన పిల్లలకు విజ్ఞాన వినోదాలు పంచడానికి చందమామ త్వరలో డిజిటల్ మాధ్యమంలోనూ వెలువడనున్నది.

## వివరాలకు జూలై సంచిక చూడండి

చందమామ చదవండి! అసంఖ్యాక పాఠక ప్రపంచానికి మరింత చేరువకండి! ప్రయోజనం పొందండి!




చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్‌కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నై-600 097
ఫోన్ : 2231 3637/2234 7399
e-mail:chandamama@vsnl.com




చందమామ సంపుటి: 60 జూన్ 2007 సంచిక:6

## ఈ నెల విశేషాలు











## ఈ సంచికలో...



**SUBSCRIPTION**

For USA and Canada
Single copy $2
Annual subscription $20

*Remittances in favour of Chandmama India Ltd.*
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal,
Chennai - 600 032
E-mail :
subscription@chandamama.org

చందా

ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. 150.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.









వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# పిల్లల ప్రవర్తన-పెద్దల బాధ్యత

భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి శాంతిని గురించి ఉపన్యసిస్తూ, ''శాంతి హఠాత్తుగా దివి నుంచి దిగివచ్చేది కాదు. అసలు సమస్యల మూలకారణాలను తొలగించినప్పుడే అది సాధ్యమవుతుంది,'' అని పేర్కొన్నారు.

ఇటీవల అమెరికాలోనూ, మనదేశంలోనూ దిగ్భ్రాంతిని కలిగించేలా జరిగిన రెండు విషాద ఘటనలు చూసినప్పుడు నెహ్రూ మాటలు గుర్తుకు వచ్చాయి. అమెరికాలోని ఒక విశ్వవిద్యాలయంలో నిరాశా నిస్పృహలకు లోనైన ఒక విద్యార్థి 3 2 మంది విద్యార్థులను, ఉపాధ్యాయులను తుపాకీతో కాల్చి చంపాడు. ఇండియాలో జరిగిన రెండు విడి విడి సంఘటనలలో ఇద్దరు విద్యార్థులు ప్రత్యర్థులను మట్టుపెట్టారు.

ఈనాటి యువత మీద మితిమించిన ఒత్తిడిని కల్గించడమే ఇలాంటి దుర్ఘటనలకు మూలకారణమని వీటిని విశ్లేషించిన కొందరు మనస్తత్వవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

ఈనాటి పోటీ ప్రపంచంలో తల్లిదండ్రులు పొద్దస్తమానం పిల్లల్ని చదువు, చదువు అంటూ వేడెక్కిస్తూనే ఉన్నారు. ఇలాంటి పెంపకం పిల్లలను కేవలం మరబొమ్మలుగా మారుస్తున్నాయి. తల్లిదండ్రులు చాలినంత సమయం పిల్లలతో గడపడానికి కేటాయించడం లేదు. పిల్లల మానసిక అవసరాలను గుర్తించి వాటిని తీర్చడానికి సరైన చర్యలు తీసుకోకపోయినట్టయితే వినాశనానికి, విషాదానికి దారితీయక తప్పదు. పిల్లల హృదయాలలో కరుణ, జాలి, ప్రేమ, ఆప్యాయత మొదలైన సున్నిత మానవతా విలువలను పాదుకొల్పుదాం. శాంతిగా, చుట్టుపక్కల వారితో సామరస్యంగా జీవించే విధానాన్ని వాళ్ళు నేర్చుకునేలా చేద్దాం!

సంపాదకుడు : **విశ్వం**

# పాఠకుల లేఖలు

'చందమామ' పిన్నల దగ్గర నుంచి పెద్దల వరకు విజ్ఞాన వినోదాలు అందిస్తోంది. ముఖ్యంగా ఏప్రిల్ సంచికలోని సంపాదకీయంలో ప్రకాశవంతమైన జీవితానికి విలువలతో కూడుకున్న విద్య అవసరం అని ఎంతో చక్కగా వివరించారు. ప్రతి ఒక్కరూ ఆలోచించవలసిన చాలా ముఖ్యమైన విషయం ఇది. –ఎం. కృష్ణమూర్తి, సూర్యాపేట - 508 213 (ఆం.ప్ర)

అరవై వసంతాల మా 'చందమామ'కు శుభాకాంక్షలతో తెలియజేయువిన్నపం. చందమామ ప్రారంభ సంచిక నుంచి యథాతథంగా పునర్ముద్రణతో ఒక ఎడిషన్ ప్రచురించి మామూలు కొత్త సంచికతో పాటు దాన్ని కూడా ఒకే కవరులో జత చేసి ప్రతినెలా అందించండి. వెల ఎంతయినా భరిస్తాం. నా ఈ కోరికను అసంఖ్యాక చందమామ సహపాఠకులు సహృదయంతో మన్నిస్తారని ఆశిస్తున్నాను.

–ఎస్. వి. లక్ష్మీ రఘుచంద్ర మహర్షి, శంషాబాద్ - 509 325 (ఆం.ప్ర)

ఏప్రిల్ సంచికలో హైదరాబాదు నుంచి శ్రీనరసింహమూర్తిగారు తెలిపినట్టు మీరు ప్రచురిస్తున్న జానపద పౌరాణిక సీరియల్స్ పుస్తక రూపంలో ప్రచురించినచో ఎందరో ఉత్సాహంగా కొనగలరు. ప్రస్తుతం రాకాసిలోయ సీరియల్ పూర్తికాగానే 'శిథిలాలయం' ప్రచురించగలరు.

–ఎ.టి. సుబ్రహ్మణ్యం, బెంగుళూరు - 560 054

1970 నుంచి పత్రికను క్రమం తప్పకుండా చదువుతూన్న పాఠకుణ్ణి. పత్రిక కోసం మీరు చేస్తూన్న సేవలు శ్లాఘనీయం. చందమామ మరో అరవై సంవత్సరాలు ఆకాశంలో నిండు చందమామలా వెలుగొందాలని ఆకాంక్షిస్తున్నాను.

–సి. నాగరాజరావు, గద్వాల, మహబూబ్‌నగర్ జిల్లా (ఆం.ప్ర)




# సీతాపతిరాజు

అమలాపురం గ్రామంలో వీరేశ్వరశాస్త్రి అనే గొప్ప జ్యోతిష్కుడు ఉండేవాడు. అతడు త్రిపురసుందరీదేవి ఉపాసకుడు. ప్రతి శుక్రవారం సూర్యోదయానికి ముందు, దేవీపూజ ముగించుకుని రాగానే, తన వద్దకు వచ్చిన వారికి ఈ జన్మకు సంబంధించిన విశేషాలనే కాకుండా, పూర్వజన్మల గురించి కూడా చెప్ప గలడని పేరుగాంచాడు.

ఈ సంగతి తెలిసి రామచంద్రపురం గ్రామాధికారి సీతాపతిరాజు, తన జాతకం చెప్పించుకోవడానికి ఒక శుక్రవారం తెల్లవారే సరికి వీరేశ్వరశాస్త్రి వద్దకు వెళ్ళాడు.

ఆయన జాతకాన్ని జాగ్రత్తగా పరిశీలించి, కొంతసేపు ధ్యానంలో గడిపి కళ్ళు తెరిచి, ''ఒకానొకప్పుడు రామచంద్రపురానికి పాలకుడిగా, దాన ధర్మాలు చేసి ధర్మ ప్రభువుగా కీర్తి గాంచిన రామచంద్రరాజు అంశ నీలో ఉన్నది. అందుకే నీకు సీతాపతిరాజు అనే నామధేయం కూడా సహజంగా సిద్ధించింది. గ్రామాధికారిగా రామచంద్రపురాన్ని ఎదురు లేకుండా శాసించగలవని కూడా జాతకం చెబుతోంది,'' అన్నాడు.

ఆ మాట వినగానే సీతాపతిరాజు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు. ఎందుకంటే, అతని వంశానికి చెందిన రామచంద్రరాజే, ఒకప్పుడు రామచంద్రపురాన్ని నిర్మించాడు. ఆ కారణం చేతనే గ్రామస్థులు ఈనాటికీ, గ్రామంలో జరిగే ప్రతి కార్యానికీ సీతాపతిరాజు కుటుంబానికి అగ్రతాంబూలం ఇచ్చి గౌరవిస్తున్నారు. ఇది గ్రామంలో తరతరాలుగా వస్తూన్న సంప్రదాయం. ప్రస్తుతం తాను గ్రామాధికారిగా మాత్రమే ఉంటున్నాడు; ఇకపై గ్రామానికి తనే రాజునని సీతాపతిరాజు ఊహలలో తేలిపోసాగాడు.

డా. జొన్నలగడ్డ మార్కండేయులు




ఆ మాటవిన్న గ్రామపెద్దలు మొదట దిగ్భ్రాంతి చెందారు. ఆ తరవాత తేరుకుని, ''గ్రామాధికారిగా ఈ గ్రామప్రజలకు మేలు చేసే నిర్ణయం తీసుకునే అధికారం మీకున్నది. అంతేగాని, జ్యోతిష్కుడు చెప్పాడు కదా అని వంద సంవత్సరాలనాటి రామచంద్ర రాజుగా మిమ్మల్ని ఊహించుకుని, ఆయన దానంగా ఇచ్చిన వాటిని ఇప్పుడు తిరిగి పుచ్చుకుంటాననడం ఏమాత్రం భావ్యం కాదు. అది సాధ్యం కూడా కాదు. కావాలంటే, రామచంద్రరాజు వంశానికి చెందిన వారుగా మిమ్మల్ని వాటికి ధర్మకర్తగా అంగీకరించగలం,'' అన్నారు వినయంగా.

రామచంద్రపురానికి తిరిగి రాగానే సీతాపతి రాజు, గ్రామానికి సంబంధించిన లెక్కలూ, పాత వివరాలూ తెప్పించి పరిశీలించాడు. రామచంద్రపురంలోని పాఠశాల, వైద్యశాల, ధర్మ సత్రం, చెరువు మొదలైనవన్నీ రామ చంద్రరాజు దానమిచ్చినవే అని తెలియడంతో, సీతాపతిరాజు తానే మళ్ళీ ఆ ఊరికి రాజై పోయినంతగా సంబరపడిపోయాడు. వెంటనే గ్రామపెద్దలను పిలిపించి, వీరేశ్వరశాస్త్రి చెప్పిన విషయం గురించి చెప్పి, ''నేను ఆ జన్మలో దానమిచ్చిన ఆస్తులన్నిటినీ ఇప్పుడు స్వాధీనం చేసుకుని నేనే నిర్వహిస్తూ, అవినీతికి తావు లేకుండా ప్రజలకు మేలు చేయాలనుకున్న అప్పటి నా ఆశయాన్ని నెరవేరుస్తాను,'' అన్నాడు.

వారి మాటలకు ఆగ్రహం చెందిన సీతాపతి రాజు కొంచెంసేపు మౌనంగా ఊరుకుని, ''ఇప్పటికే గ్రామాధికారిగా నేనే వాటికి ధర్మకర్తను. ఆ విషయం నాకు తెలుసు. మీరు కొత్తగా చెప్పవలసిన అవసరం లేదు. వాటి మీద నా అధికారాన్నీ, నేను తీసుకునే నిర్ణయాలనూ ప్రశ్నించే హక్కు మీకు లేదు. మీ అనుమతి కోరికాదు; ఏదో చెప్పాలి గనక చెప్పాను. అంతే,'' అన్నాడు తీవ్రమైన కంఠ స్వరంతో.

ఆవేశంతో మాట్లాడుతూన్న గ్రామాధికారికి బదులు చెప్పడానికి జంకిన గ్రామ పెద్దలు, ''ఏమైనా మీవల్ల మాకు మంచే జరుగుతుంది,'' అని చెప్పి అక్కడి నుంచి బయలుదేరారు.

ఆ రోజు నుంచి సీతాపతిరాజు ధర్మసత్రం, పాఠశాల, వైద్యశాల విషయాల్లో అనవసరంగా చీటికీ మాటికీ జోక్యం చేసుకోవడం మొదలుపెట్టాడు. రామచంద్రరాజు దానగుణం తనలో ఉందని ముఖస్తుతి చేసిన వారికీ, అలా పొగడని వారిపై చాడీలు చెప్పే వారికీ కానుకలిచ్చేవాడు. తనకు నచ్చని వాస్తవాలు ఎవరైనా చెబితే కఠినంగా శిక్షించేవాడు. అలాంటి వారిని ఉద్యోగాలనుంచి తొలగించేవాడు. తనను అడిగేవారు లేరన్న అహంతో విర్రవీగసాగాడు.

ఇలాంటి బాధలు రోజురోజుకు ఎక్కువ కావడంతో కొందరు ఉద్యోగులు, ఇక భరించలేక అమలాపురం వెళ్ళి వీరేశ్వరశాస్త్రిని చూసి విషయం వివరించి, ''జ్యోతిషం నిజమో, కాదో మాకు తెలియదు. అయితే, కొందరికి గత జన్మల గురించిన అపోహలు కలిగిస్తే మాత్రం విపరీత పరిణామాలకు దారి తీస్తాయి. మేము అనుభవిస్తున్న బాధలే అందుకు నిదర్శనం. ఆ బాధల నుంచి బయటపడే మార్గం మీరే చూపాలి,'' అని మొరపెట్టుకున్నారు.

ఆ పరిస్థితికి వీరేశ్వరశాస్త్రినొచ్చుకుని, ''నేను చెప్పింది జ్యోతిషం. అది గణితం మీద ఆధారపడిన గొప్ప శాస్త్రం. అది ఎన్నటికీ తప్పుకాదు. చెప్పేవారిలో, చెప్పించుకునే వారిలో దోషాలు దొర్ల వచ్చు. ఏమైనా నా కారణంగా మీరు బాధలు అనుభవిస్తున్నందుకు విచారిస్తున్నాను,'' అని కొంతసేపు ఆలోచించి, ''వచ్చే ఏకాదశి నాటికి సీతాపతి



రాజుకు గ్రామపెద్దల సమక్షంలో ఒకసన్మాన సభ ఏర్పాటు చేయండి. ఆ సభకు ప్రత్యేక అతిథిగా నేను వచ్చి, మీ బాధలు తొలగి స్తాను; నిశ్చింతగా వెళ్ళిరండి,'' అన్నాడు.

రామచంద్రపురానికి తిరిగివచ్చిన ఉద్యో గులు వీరేశ్వరశాస్త్రి చెప్పిన రోజున సీతాపతి రాజు సన్మాన సభ ఏర్పాటు చేశారు. వీరేశ్వర శాస్త్రి ప్రత్యేక అతిథిగా వచ్చి తనను ఆశీర్వ దిస్తాడని తెలియగానే, సీతాపతిరాజు మరింత ఆనందంతో సభకు వచ్చాడు. వీరేశ్వరశాస్త్రి ప్రసంగిస్తూ, ''గ్రహగతులనుబట్టి మానవుల భూత భవిష్యత్తులను తెలియజేసే అద్భుత శాస్త్రం జ్యోతిషం. ఈ గ్రామాన్ని నిర్మించిన రామచంద్రరాజే ఇప్పుడు గ్రామాధికారి సీతా పతిరాజుగా జన్మించాడని, నేను చెప్పిన సంగ తిని పలువురు ప్రస్తావించి ప్రశంసించారు. చాలా సంతోషం. అలాగే వచ్చే జన్మలో సీతాపతి రాజు కాలభైరవాంశతో జన్మించడం ఖాయం అని కూడా నా జ్యోతిషం లెక్కలు చెబుతు న్నాయి. అంటే, అతడు ఈ జన్మలో మంచిగా నడుచుకుంటే కాలభైరవరాజుగానూ, లేకుంటే కాలభైరవుడి మరోరూపమైన శునకంగానూ పుట్టగలడు. సీతాపతిరాజు మునుముందు ప్రజల అవసరాలు తీర్చడంలో పక్షపాతం చూపకుండా ధర్మబద్ధంగా ప్రవర్తించి, ఈ జన్మను సార్థకం చేసుకుని, మళ్ళీ కాలభైరవ రాజుగా ఈ రామచంద్రపురంలోనే జన్మించి, ఊరికి ఉపకారం చేయాలని ఆశీర్వదిస్తు న్నాను. ఆయనకు శునక జన్మ ప్రాప్తించ కూడదని త్రిపురసుందరీ దేవిని త్రికరణ శుద్ధిగా ప్రార్థిస్తున్నాను,'' అన్నాడు.

ఆయన ప్రసంగానికి అక్కడ చేరినవారం దరూ ఆనందంతో చప్పట్లు కొట్టారు. సీతా పతిరాజు మాత్రం ఉలిక్కిపడ్డాడు. వీరేశ్వర శాస్త్రి జ్యోతిషం ద్వారానే తనను పరోక్షంగా హెచ్చరించాడని గ్రహించాడు. తనకు చేసిన సన్మానానికి ప్రజలకు కృతజ్ఞతలు చెప్పాడు. ఆ క్షణం నుంచే బుద్ధిని సరిదిద్దుకుని మంచి గ్రామాధికారిగా ఉద్యోగులతోపాటు అందరి మన్ననలూ పొందాడు.





# ఉపాయం

ధర్మరాజపురంలో చిల్లరకొట్టు నడుపుతూ బతుకీడుస్తున్న చిన్న వ్యాపారి రామయ్య. అతని ఇంటి పక్కన కొంచెం ఖాళీ స్థలం ఉంది. ఆ స్థలం యజమాని దాన్ని గురించి పట్టించుకోక పోవడం వల్ల అక్కడ ఊళ్ళోని చెత్తంతా తెచ్చిపోసేవారు. కొన్నాళ్ళకు అది ఒక చెత్తకుండీలా తయారయింది.

ఇలా వుండగా ఒకనాడు పొరుగూరి నుంచి రామయ్య బావమరిది సోమయ్య అక్కనూ, బావనూ చూసిపోదామని వచ్చాడు. మాటల సందర్భంలో ఇంటి పక్క ఖాళీ స్థలం గురించి అక్క వరదమ్మ తమ్ముడికి చెప్పి, ''నువ్వైనా మీ బావకు చెప్పరా. ఇల్లు మారిపోదామంటే వినడం లేదు. మన చిల్లరకొట్లో పెట్టే తిను బండారాలపై ఈగలు వాలుతున్నాయి. ఈ పక్క నంతా ఒకటే కంపు, మేం భరించలేం అంటూ కొనడానికి ఎవ్వరూ రావడం లేదు. ఇలాగే సాగితే రేపు పిల్లల బాగోగులు ఎలా చూడ గలం?'' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

సోమయ్య అక్క బాధ విని ఏదో ఒక ఉపాయం ఆలోచించాలనుకున్నాడు.

''ఈ విషయం ఊరి పెద్దల దృష్టికి తేవచ్చు కదా?'' అన్నాడు సోమయ్య.

''అదీ అయింది. ప్రయోజనం లేదు,'' అన్నది వరదమ్మ నిట్టూరుస్తూ.

''అలాంటప్పుడు దేవుడి మీద భారం వేసి ఊరుకో. అంతా ఆయనేసర్దుకునేలా చేస్తాడు,'' అని ధైర్యం చెప్పి, వెళ్ళాడు సోమయ్య.

మూడో రోజు మిట్టమధ్యాహ్నం వేళ, అటు కేసి వచ్చిన ఒక పొరుగూరు ముసలావిడ, ఖాళీ జాగాలో ఉన్న వేపచెట్టుకింద వినాయ కుడు వెలిశాడని అక్కడ ఉన్నవాళ్ళతో ఆశ్చ ర్యంగా చెప్పింది. ఆ వింత దృశ్యాన్ని వీధి వీధంతా వచ్చి చూసింది. ఇంతలో పాలు అమ్ముకునే మునెమ్మ వచ్చి ఆ చెట్టు చుట్టూ శుభ్రంగా చిమ్మి, నీళ్ళు చల్లి ముగ్గులు పెట్టింది. ఆ పక్కనున్న సుగుణమ్మ పూలు, కొబ్బరికాయ, కుంకుమ, పసుపు తెచ్చి పూజలు

భాస్కర స్వర్ణాంబ

చేసింది. ఆ సాయంత్రానికల్లా, ఎక్కడా చెత్త కనిపించలేదు. పైగా, అగరు వత్తుల పరిమళాలు; పూల వాసనలు!

ఆ రోజు నుంచి రామయ్య చిల్లరకొట్టు వ్యాపారం పుంజుకున్నది. కర్పూరం, కొబ్బరికాయల వగైరాల అమ్మకం పెరిగింది.

మరో రెండు వారాల తరవాత సోమయ్య అక్కను చూడడానికి వచ్చినప్పుడు, ''నీ నోటి మాట ఫలించింది సోమయ్యా. నువ్వు చెప్పింది అలాగే జరిగింది,'' అన్నది వరదమ్మ తమ్ముడితో సంతోషంగా.

అప్పుడే కొట్టు నుంచి భోజనానికి వచ్చిన రామయ్య, ''సోమయ్య ఏం చెప్పాడేమిటి?'' అని అడిగాడు భార్యను.

''దేవుణ్ణి నమ్ముకో. అంతా ఆయనే సర్దుకునేలా చూస్తాడు, అని చెప్పాడండీ. అలాగే జరిగింది కదా!'' అన్నది వరదమ్మ.

రామయ్య బామ్మరిదికేసి తిరిగి, ''అవునూ, వినాయకుడు నిజంగానే వెలిశాడంటావా?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

''నిజంగా వెలిశాడో, లేదో మనకు అనవసరం. మీకు ఇప్పుడు హాయిగా ఉందా లేదా?'' అని అడిగాడు సోమయ్య. ''హాయిగా, మునుపటికన్నా సంతోషంగా ఉన్నాం. అది వేరే విషయం. నా అనుమానమంతా ఆ వేపచెట్టు వినాయకుడి రూపం గురించే,'' అన్నాడు రామయ్య మళ్ళీ.

''అవును, బావా. వేపచెట్టు బోదెలో వినాయకుడి రూపం అమర్చింది నేనే. మీరు ఆ ఖాళీ జాగాలో పేరుకుపోయిన చెత్తవల్ల నానా ఇబ్బందులు పడుతున్నారని ఈ ఉపాయం ఆలోచించాను. మనవాళ్ళు చూస్తూ చూస్తూ గుడిని అపవిత్రం చేయలేరు. మీకిప్పుడు పరిసరాలు పరిశుభ్రంగా ఉంటాయి. ఇది మోసం చేయడం అని నేను అనుకోను. ఉపాయం లేని వాణ్ణి ఊళ్ళోంచి తరిమేయాలని మనకొక సామెత ఉందికదా. దీనివల్ల ఎవరికీ కష్టం లేదు. బాధ లేదు. పైగా కాస్సేపు దైవారధన వల్ల మనశ్శాంతి లభిస్తుంది. మంచిదే కదా?'' అన్నాడు సోమయ్య.

బావమరిది ఉపాయం ఫలించినందుకు రామయ్య చాలా సంతోషించాడు. అతనికేసి మెచ్చుకోలుగా చూస్తూ, చిన్నగా నవ్వుతూ అవునన్నట్టు తల ఊపాడు.






# రాకాసిలోయ

## 22

[కేశవుడూ, అతడి వెంటవున్న వాళ్ళకు, కేశవుడి ముసలితండ్రీ, అతడి అనుచరుడు కోయ యువకుడూ కనిపించారు. కాని, అక్కడ నరభక్షకులతో జరిగిన యుద్ధంలో, తిరిగి ఎటువాళ్ళటు పారిపోయారు. ప్రాణాలతో తప్పించుకుని కొండ శిఖరాన్ని చేరిన కేశవుడూ, అతడి అనుచరులకు గుహకు ఆవల ఒక మహాసర్పం, ఒక భయంకర మృగంతో చేస్తున్న పోరాటం కనిపించింది. —తరవాత]

కేశవుడూ, జయమల్లూ గుహలో ఏర్పడిన కంత నుంచి బయిటికి చూస్తూంటే, కోయ యువకుడు గుహలోని చీకటి కోణాలన్నీ వెతకసాగాడు. అతడికి ఒక మూల కొన్ని విల్లంబులు కనిపించినై. అతడికి ఎక్కడలేని ధైర్యం కలిగింది. ఒక విల్లు చేతికి తీసుకుని, దానికి తాడు తగిలించి, అంబుల పొదిని భుజాన వేసుకుని, వాడు కేశవుడూ, జయమల్లుల దగ్గిరకు వెళ్ళాడు.

జయమల్లు కోయయువకుడి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, ''గోమాంగ్! ఇవన్నీ ఎక్కడివి? బాణం ఎక్కుపెట్టుతున్నావెందుకు? దానితో భయంకర మృగాన్ని చంపాలనుకుంటున్నావా?'' అని అడిగాడు.

కోయగోమాంగ్ అవునన్నట్టు తలవూపి, బాణాన్ని వదలబోయేంతలో కేశవుడు చప్పున వెనుదిరిగి, అతడి చెయ్యి పట్టుకుని, ''నువ్వు చెయ్యబోయేది చాలా ప్రమాదకరమైనపని. నీ బాణం దెబ్బకు ఆ రెంటిలో ఏదీ చావక పోగా, అవి రెండూ కలిసి మన మీదికి విరుచుకుపడినా పడవచ్చు. వాటి నెందుకు రెచ్చకొట్టటం? అసలు ఈ విల్లంబులు నీ



వెక్కడ సంపాయించావ్?'' అని ప్రశ్నించాడు. కోయగోమాంగ్ గుహలోని ఒక చీకటి మూలకు చేయి చూపాడు. కేశవుడు అక్కడికి పరిగెత్తి, ఒక విల్లూ, కొన్ని అంబులూ చేతికి తీసుకుంటూ, ''ఇవి ఈ సమయంలో మనకెంతో అవసరం. కత్తులు తప్ప అన్నీ పోగొట్టుకున్నాం. ఇక గుహనుంచి బయట పడదామా?'' అన్నాడు.

''ఈ బాణాలూ ఇవీ బహుశా, ఈ రెండు కంకాళాల తాలూకువయి వుంటవి. వీళ్ళిద్దరూ ఇక్కడికి ఎందుకు వచ్చినట్టు? ఎలా మరణించినట్టు?'' అన్నాడు జయమల్లు.

''ఆ ప్రశ్నకు జవాబు కనుక్కునేలోపల మనంకూడా వాళ్ళతో చేరిపోవలసి రావచ్చు. ఆ తరవాత మన వెనక వచ్చినవాళ్ళు, మన కంకాళాలను చూసి, ఇలాంటి ప్రశ్నలే వేసుకుంటారు!'' అన్నాడు కేశవుడు విసుగ్గా.

జయమల్లు ఏదో చెప్పబోయేంతలో, గుహవెనకభాగం మీదికి, భయంకర మృగం, మహాసర్పం ఉప్పెనలా వచ్చి పడినై. వాటి తాకిడికి గుహ అంతా కంపించి పోయింది. కేశవుడూ, అతడి అనుచరులిద్దరూ గుహలో బోర్లా పడిపోయారు. గుహ మధ్యభాగం రెండుగా విచ్చిపోయి, ఫెళ ఫెళ మంటూ రాళ్ళూరప్పలూ అందులోకి దొర్లుకుపోయినై. కేశవుడూ, అతడి స్నేహితులు కూడా వాటి వెంట కింద అగాధంలోకి పడిపోయారు.

ముగ్గురికీ దెబ్బలు తగిలినై. శరీరమంతా రాళ్ళ మధ్య పడటంతో గీచుకుపోయింది. కాని, వాళ్ళ కత్తులూ, విల్లంబులూ వాళ్ళతో పాటు కింది అగాధంలోకి పడిపోయినై. ముగ్గురూ ఒళ్ళు దులుపుకుంటూ లేచి నిలబడ్డారు. ఇంత ప్రమాదంలో చిక్కినా, ఏకాలో చెయ్యో విరగనందుకు, సంతోషించారు.

''మనం గొప్ప అదృష్టవంతులం!'' అన్నాడు కేశవుడు.

''అందుకేం సందేహం! కాని, ఈ చీకటి కోనలోంచి బయటపడటం ఎలా? అదీ ఇప్పటి సమస్య!'' అన్నాడు జయమల్లు.

కోయగోమాంగ్, అగాధం వెంట కొంచెం దూరం మోకాళ్ళ మీద పాకిపోయి, ఒక మలుపు తిరిగి, ''కేశవా, జయా! మనకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదు. మనం కొండ పొట్టలోని గుహకందరాల్లో చిక్కుకు పోయాం. కాని, ఎక్కడినుంచో కొంచెం వెలుగు వచ్చి పడుతున్నది. మనం సురక్షితంగా ఇక్కణ్ణించి బయటపడొచ్చు,'' అన్నాడు. గోమాంగ్ మాటలు వింటూనే కేశవుడూ, జయమల్లూ

ఆత్రంగా అతడున్న చోటుకు పరిగెత్తారు. వాళ్ళకూ అంత దూరానవున్న సొరంగంలో కొద్ది పాటి వెలుగు కనిపించింది. కాని, అది ఎటునుంచి వస్తున్నదో మాత్రం అర్థం కాలేదు.

''సరే, ఇక మనం బయలుదేరుదాం. ఇక్కడ ఎటు చూసినా గుహ మార్గాలు కనిపిస్తున్నవి. దేని వెంట వెళితే, మనం బయలు ప్రదేశాన్ని చేరగలమో అర్థం కావటంలేదు,'' అన్నాడు జయమల్లు.

కేశవుడు మౌనంగా ముందుండి దారి తీశాడు. అతడికి తన ముసలితండ్రిని గురించిన దిగులుతోపాటు, ఇప్పటి తన స్థితి కూడా దిగులు పుట్టిస్తున్నది. బహుశా, ఇక్కడ అడ్డదిడ్డంగా వున్న సొరంగ మార్గాల్లో చిక్కుకుని, తనూ, తన స్నేహితులిద్దరూ మరణించవచ్చని కూడా అతడు భావించాడు.

ముందు నడుస్తున్న కేశవుడికి కొంత దూరం పోయిన తరవాత, హఠాత్తుగా మార్గం రెండు మూడు వైపులకు చీలిపోవటం కనిపించింది. తను వాటిల్లో దేని వెంట వెళ్ళాలి? అన్న ప్రశ్న అతడికి ఎదురయింది. అతడి తటపటాయింపు గ్రహించిన వాడిలా వెనక వున్న జయమల్లు, ''కేశవా! ఆలోచించేందుకేముంది? ముక్కుకు సూటిగా నడువు. ఈ కాస్త గుడ్డి వెలుగు వున్నంతవరకూ, మనం నిరాశ చెందనవసరంలేదు,'' అన్నాడు.

జయమల్లు మాట ముగించేలోపల, ఎడమవైపునున్న సొరంగ మార్గాన్నుంచి కీచుమన్న వికృత ధ్వని వినిపించింది. ఆ వెంటనే రెక్కలల్లాడినప్పుడయ్యే తపతపమనే ధ్వనిలాటి శబ్దం వినబడింది. కేశవుడు చప్పున



కత్తి దూసి మార్గం మలుపు తిరిగి నిశ్చేష్టుడయిపోయాడు. అతడి వెనకవున్న జయమల్లుకు కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. కోయగోమాంగ్ 'దయ్యం' అంటూ కీచుమన్నాడు. జయమల్లు బిగ్గరగా నవ్వాడు. కేశవుడు తన అంబుల పొది కేసి చేయి పోనిచ్చాడు. గోమాంగ్, ఆ సరికే బాణం ఎక్కుపెట్టి వున్నాడు.

సొరంగ మార్గంపైన ఎగుడుదిగుడుగా వున్న రాళ్ళమీద నిలువెత్తునవున్న ఒక నల్లని ఆకారం తారట్లాడుతున్నది. ఆ గుడ్డి వెలుగులో కూడా ఆ ఆకారం నోటిపళ్ళు తళతళ మెరుస్తున్నవి.

''గోమాంగ్, అది దయ్యం కాదు, దయ్యపు గబ్బిలం! బాణం ఎక్కుపెట్టావు గదా, గురిగా దాని తలమీద తగిలేలాకొట్టు!'' అన్నాడు జయమల్లు. అదే క్షణంలో గోమాంగ్



వదిలిన బాణం రివ్వుమంటూ వెళ్ళి, దయ్యపు గబ్బిలం తలను తాకింది. గబ్బిలం కీచు మంటూ అరిచి పల్లటీలు కొడుతూ కిందపడి పోయింది.

గోమాంగ్ ముందుకు వెళ్ళి గిలాగిలా కొట్టుకుంటున్న గబ్బిలాన్ని ఒక అంబుతో పొడిచి చూస్తూ, ''అడవిలో పుట్టి అడవిలో పెరిగిన వాణ్ణయినా, ఇంత పెద్ద గబ్బిలాన్ని నే నెన్నడూ చూడలేదు,'' అన్నాడు.

''ఆ మాట కొస్తే, నేనూ చూడలేదు. మన మేదో ఒక వింత ప్రపంచంలోకి వెళుతున్నామని నా అనుమానం,'' అన్నాడు జయమల్లు.

''బహుశా, ఇదే రాకాసిలోయకు వెళ్ళే మార్గమేమో!'' అన్నాడు కేశవుడు.

''మీకేమైనా అరుపులు... తోడేళ్ళ అరుపుల్లాంటివి, వినబడుతున్నవా?'' అని ప్రశ్నించాడు కోయగోమాంగ్.

కేశవుడూ, జయమల్లూ ఓ క్షణకాలం ఆగి, ''అవును, ఏవో జంతువులు మొరుగుతున్న ధ్వని అస్పష్టంగా వినబడుతున్నది,'' అన్నారు ఆశ్చర్యంగా.

''అయితే ఇక మనం బతికి బయట పడ్డట్టే. తోడేళ్ళున్నచోట, కావలసినంత వేట వుంటుంది. తినేందుకు కొల్లలు కొల్లలు!'' అన్నాడు గోమాంగ్ ఉత్సాహంగా.

''ముందు మనం గజిబిజిగా వున్న, ఈ సొరంగమార్గాల నుంచి బయటపడ్డప్పుడు గదా, తిండి మాట,'' అన్నాడు కేశవుడు.

''నావి పాము చెవులు! నన్ను దారి తీయ నీయండి. సూటిగా ఆ తోడేళ్ళ మంద మధ్యకు తీసుకుపోతాను,'' అంటూ గోమాంగ్ చెవులు రిక్కించి, తోడేళ్ళ అరుపులు ఏవైపు నుంచి వస్తున్నవో పసిగడుతూ ముందు నడవసాగాడు. నాలుగైదు నిమిషాల కాలం సొరంగ మార్గాల్లో నడిచిన తరవాత, వాళ్ళకు హఠాత్తుగా ఒక గుహవైపు నుంచి కళ్ళు మిరుమిట్లు కొలిపే వెలుగు కనిపించింది. ముగ్గురూ ఉత్సాహంతో ఎగిరి గంతులేశారు. గుహబయట చిన్నచిన్న పొదలూ, కొంచెం దూరంలో పెద్దపెద్ద చెట్లూ వాళ్ళ కంట బడినై. తోడేళ్ళ అరుపులు కూడా మరింత దగ్గిరగా వినిపించసాగినై.

కేశవుడూ, అతడి అనుచరులూ వెలుగు వస్తున్న గుహద్వారం నుంచి బయటికి వచ్చారు. గుహముందు ఒకపక్కగా సమతలంగా వున్న ప్రదేశంలో, పదీ పన్నెండు జింకలూ, కొన్ని లేళ్ళూ మందగా నిలబడి వున్నవి. వాటి చుట్టూ గుండ్రంగా తిరుగుతూ నాలుగు తోడేళ్ళు పెద్దగా అరుస్తున్నవి. తమను సమీ

పించవచ్చే తోడేళ్ళను, మెలితిరిగిన కొమ్ములు గల జింకలు కొన్ని తలలు వంచి పొడిచేందుకు ప్రయత్నిస్తున్నవి.

''తోడేళ్ళను ఎదిరించే జింకలను, నేనెక్కడా చూడలేదు,'' అన్నాడు జయమల్లు.

''అది నీ దురదృష్టం. ప్రాణరక్షణకు, తోడేలును చంపిన కొండ గొర్రెను నేను చూశాను,'' అన్నాడు కోయగోమాంగ్.

వాళ్ళీ విధంగా మాట్లాడుకునేంతలో తోడేళ్ళ దృష్టి వాళ్ళమీద పడింది. అవి చప్పున జింకల చుట్టూ తిరిగేవల్లా ఆగి, కోరలు చాస్తూ, ఆ ముగ్గురికేసీ వేగంగా రాసాగినై. కేశవుడు బాణం ఎక్కుపెట్టి ఒక తోడేలును కొట్టాడు. బాణం గుండెల్లో తగలగానే, తోడేలు పెద్ద పెట్టున అరిచి, ఎగిరి అంత దూరాన పడింది. మిగతా తోడేళ్ళు భయంకరంగా మొరుగుతూ కేశవుడూ వాళ్ళున్న చోటుకు పరిగెత్తిరాసాగాయి. గోమాంగ్, జయమల్లు కూడా బాణాలు ఎక్కుపెట్టి వదిలారు. గోమాంగ్ దెబ్బకు మరొక తోడేలు కింద పడింది. తతిమ్మా తోడేళ్ళు రెండూ ఒక్క క్షణం నిలబడి, తరవాత పెద్దగా మొరిగి, బండరాళ్ళ మీది నుంచి దూకుతూ అడవిలోకి పారిపోసాగినై.

కోయ గోమాంగ్ పెద్దగా నవ్వి, ''అరె, జింకలూ, లేళ్ళూ ఎక్కడ?'' అంటూ ఆశ్చర్య పడ్డాడు.

''నువ్వు చూడలేదా? అవి ఎప్పుడో పారిపోయినై. తోడేళ్ళ బారినుంచి తప్పుకుని, మన బారిన పడేందుకవేమీ తెలివితక్కువవి కావు,'' అన్నాడు కేశవుడు.



''నాకు చచ్చే ఆకలేస్తున్నది. దొరికితే ఒక లేడిని తినేయగలను,'' అన్నాడు గోమాంగ్.

''అందరికీ ఆకలిగానే వుంది. కాని, మనం మండూకుడూ, బ్రహ్మదండి అనుచరుల్నుంచి ప్రమాదం రాకుండా చూసుకోవాలి. వాళ్ళు మనకోసం కొండలూ, గుట్టలూ గాలిస్తున్నారు,'' అన్నాడు జయమల్లు.

కోయగోమాంగ్ చుట్టూ ఓమారు కలయ చూసి, ''నన్నడిగితే, అసలిది నరభక్షకుల లంకే కాదంటాను. ఇక్కడి చెట్లూ చేమలూ, ఈ కొండ తీరూ అంతా భిన్నంగా వున్నది. ఏమంటావ్, కేశవా?'' అన్నాడు.

కేశవుడు కూడా చుట్టూ పరీక్షగా చూసి, ''మనం బహుశా, కొండ గుహల్లో కందరాల్లో పడి, మరో లంకకో, దేశానికో చేరినా చేరి వుండొచ్చు. అయినా, మన జాగ్రత్తలో మనం

వుండాలి,'' అంటూ జయమల్లు కేసి తిరిగి, ''మల్లూ, మా అయ్య నరభక్షకులకు దొర క్కుండా పారిపోయి వుంటాడంటావా?'' అని ప్రశ్నించాడు.

''ఓ, అందుకు సందేహమా? మీ అయ్య కన్న జిత్తులమారిని నేనెక్కడా చూడలేదు. చెట్ల మీద వుండి, అంతమంది నరభక్షకుల్నీ ఎలా హడలగొట్టాడో చూశావు గదా? ఆ వెంట వున్న చిన్న గడేజంగ్ ధైర్యసాహసాల్లో సింహం అంటే నమ్ము,'' అన్నాడు జయమల్లు.

జయమల్లు మాటలతో కేశవుడికి కాస్త ఉత్సాహం కలిగింది. అతడు అడవి కేసి చూస్తూ, ''మనం ముందు ఏదైనా ఆహారం సంపాయించాలి. నాకు దాహంకూడా అవుతు న్నది. ఈ దగ్గిర్లో ఎక్కడో నీరుండక పోదు,'' అంటూ ముందుకు నడిచాడు.

ముగ్గురూ కొండ సమీపాన్నుంచి, అడవి లోకి నడవసాగారు. అప్పటికి సూర్యుడు పడ మటి దిక్కుకు వాలాడు. ముగ్గుర్నీ ఆకలి బాధిస్తున్నది. చెట్లనేమైనా పళ్ళుగాని, తేనె తుట్టెలుగాని దొరుకుతవేమో అని గోమాంగ్ తల ఎత్తి చూస్తూ నడవసాగాడు. అట్లా నడు స్తున్న గోమాంగ్ హఠాత్తుగా ఒక కాలు భూమి లోకి గుచ్చుకుపోవటంతో కేక పెట్టాడు. పక్కనే వున్న జయమల్లు అతడి జబ్బ పుచ్చు కుని వెనక్కు లాగాడు.

చూడటానికి సమతలంగా వున్న ఆ ప్రదే శంలో, ఏ కారణంవల్ల గోమాంగ్ ఊబిలో చిక్కుకున్నవాడిలా ముందుకు పడబోయాడో వాళ్ళకు అర్థంకాలేదు. కేశవుడు అక్కడ అడ్డదిడ్డంగా పడివున్న చెట్ల కొమ్మల్నీ, రెమ్మల్నీ తొలిగించాడు. దిగువను వాళ్ళకు ఒక గొయ్యి కనిపించింది. అందులో నిలువునా పాతివున్న గసిక కర్రల మీద ఒక పులి కొనవూపిరితో కొట్టుమిట్టాడుతున్నది.

''ఇది, మనుషుల కోసమో, జంతువుల కోసమో ఎవరో పెట్టిన మాటు. కాస్తలో ప్రమాదం తప్పుకున్నాం,'' అన్నాడు కేశవుడు. అదే సమయంలో అన్ని వైపులనుంచీ, రాళ్ళూ, కర్రలూ వాళ్ళ మీదకు జడివానలా వచ్చి పడసాగినై. కేశవుడూ, అతడి అనుచరులూ విల్లంబులు పైకెత్తి, భూమిమీద బోర్లా పడు కుని, చుట్టూ కలయ చూడసాగారు. ఎక్కడా మనిషిజాడ లేదు. -(ఇంకావుంది)



బేతాళ కథలు

# విధి విలాసం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు ఎవరికి సాయంచేయడానికి, ఎవరి మాటలను విశ్వసించి ఇలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, విజ్ఞులమని భావించే కొందరు, మొదట తాము చెప్పిన మాటను వెంటవెంటనే తామే మార్చుకుంటూ, దానికి విరుద్ధమైన సలహాలు ఇస్తూ మేధావులను సైతం తికమక పెడుతూ, తప్పు దారి పట్టిస్తూ ఉంటారు. పరస్పర విరుద్ధమైన సలహాలతో వివేకి అయిన తన పూర్వ



శిష్యుణ్ణి సంశయానికి గురి చేసిన ఒకసుప్రసిద్ధ గురువు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఆరావళీ పర్వత పాదతలంలో గురుకులాశ్రమం నెలకొల్పి నడుపుతూన్న గురువు జ్ఞానభాస్కరుడికి ఐదేళ్ళకోసారి ఒంటరిగా దేశాటన చేస్తూ, తన పూర్వశిష్యుల మంచి చెడ్డలనూ, దేశస్థితిగతులనూ ప్రత్యక్షంగా చూసి రావడం అలవాటు. అలా ఆయన ఒకసారి దేశాటనకు వెళ్ళి, తిరిగి వస్తూ మార్గమధ్యంలో పశువులు కాస్తున్న ఒక పన్నెండేళ్ళ కుర్రవాణ్ణి చూశాడు. చిట్టడవిని ఆనుకుని వున్న మైదానంలో పశువులు మేస్తున్నాయి. ఆ కుర్రవాడు తాడిచెట్టు కింది నీడలో కూర్చుని, తాళపత్రంలోని పద్యాన్ని వల్లెవేస్తూ కనిపించాడు. ఆ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయిన గురువు, అడుగు ముందుకు వేయలేక అక్కడే నిలబడ్డాడు.

అంతలో, ''ఒరే భద్రయ్యా, మీ అమ్మ గంజి తెచ్చింది. రా తాగి వెళుదువు,'' అన్న కేక వినిపించడంతో, ఆ కుర్రవాడు తాళపత్రాన్ని, కూర్చున్న బండకింద దాచి, చెంగున లేచి పిలుపు వినిపించిన దిక్కుకేసి పరిగెత్తాడు. గురువు వాణ్ణి అనుసరించి వెళ్ళాడు.

బావిగట్టున కుర్రవాడి తల్లి పోసిన గంజిని తండ్రీ కొడుకులు ఐదారు దోసిళ్ళు తాగారు. అంతలో తండ్రి చూపు గురువు మీద పడడంతో, ''అరరే, గంజి తాగేశామే. కొంచెం ముందు వచ్చివుంటే బావుండేది. ఇప్పుడూ మించిపోయింది లేదులే,'' అంటూ అతడు దాపులనున్న తాటిగెలనుంచి, నాలుగు ముంజెలు కొట్టి గురువుకు అందించాడు.

గురువు తాటి ముంజెలను తింటూ, ''సరస్వతీ కటాక్షం వున్న మీ అబ్బాయికి పశువులుకాచే పని అప్పగించావేమిటి?'' అని అడిగాడు.

''నాకూ వాణ్ణి చదివించాలనే ఉన్నది స్వామీ. అయినా మట్టిపిసుక్కుంటూ, గొడ్డూగోదా మేపుకుంటూ బతికే మా కులంలో పుట్టిన వాణ్ణి శిష్యుడిగా తీసుకుని విద్యనేర్పే గురువులు లేరుకదా,'' అన్నాడు తండ్రి విచారంగా నిట్టూరుస్తూ.

ఆ మాట విన్న గురువు, తాను నడుపుతూన్న గురుకులాశ్రమం గురించి వివరించి, ''మీ అబ్బాయిని నాతో పంపుతావా, నేను వాడికి ఉచితంగా విద్యనేర్పుతాను,'' అన్నాడు.

''అంతకన్నా కావలసిందేమున్నది స్వామీ? తప్పకుండా పంపిస్తాను,'' అంటూ తండ్రి కొడుకు భద్రయ్యకేసి చూశాడు.

భద్రయ్య ముఖం ఆనందంతో విప్పారింది. మరునాడు సూర్యోదయమవుతూండగా అతడు గురువు వెంట బయలుదేరాడు.

గురుకులాశ్రమం చేరాక, భద్రయ్య వినయ విధేయతలతో, భక్తిశ్రద్ధలతో నిరంతర అభ్యాసంతో యుక్తవయస్కుడయ్యేసరికి అన్ని విద్యలలోనూ ఆరితేరాడు. ముఖ్యంగా అతడు గణితశాస్త్రం మీద, వ్యాపార విషయాల పట్ల అమిత ఆసక్తి కనబరచేవాడు.

విద్యాభ్యాసం పూర్తి చేసుకుని బయలుదేరే ముందు గురువు అతనితో, ''భద్రయ్యా, ఎక్కడో మారుమూల గ్రామంలో పుట్టిన నువ్వు, ఈ రోజు ఇంతటి విద్యావంతుడు కావడం నాకెంతో సంతోషంగా ఉన్నది. దీనికంతటికీ కారణం నీ తెలివితేటలు, నిరంతర శ్రమ మాత్రమే అన్న సంగతి ఎన్నటికీ మరువకు. ప్రతి మనిషి ప్రగతికీ, పతనానికీ అతడి ఆలోచనలూ, చేతలే కారణం. ప్రపంచంలో పుట్టే ప్రతి ఒక్కరికీ పంచ భూతాలూ, పరిసరాలూ ఒకే విధంగానే ఉంటాయి. అయితే, కొందరు మాత్రమే వాటిని సద్వినియోగం చేసుకుని ప్రగతి శిఖరాలను అధిరోహించడానికి కారణం ఏమిటి? వారి కృషి, పట్టుదల! ఈ సత్యం గుర్తుంచుకుని నువ్వు స్వయం కృషితో, శోధించి సాధిస్తూ, వెలుగు బాటలో పయనిస్తూ పదిమందికీ దారి చూపాలి. అప్పుడప్పుడూ వచ్చి నీ జీవితంలో సాధించే ప్రగతిని తెలియజేస్తే సంతోషిస్తాను,'' అని చెప్పి ఆశీర్వదించాడు.





స్వగ్రామం చేరిన భద్రయ్య, తాను నేర్చుకున్న విద్యను ఉపయోగించడానికి అక్కడ ఏమాత్రం అవకాశాలు లేవని గ్రహించాడు. తండ్రిని ఒప్పించి కొంత పొలం అమ్మి, చిన్న మొత్తంతో పట్నం చేరాడు. అక్కడ వస్త్రాలకు గిరాకీ ఉంటుందని తెలుసుకుని బట్టల దుకాణం పెట్టాడు. వ్యాపారమయితే సాగుతున్నదిగానీ, నిలదొక్కుకోలేక పోయాడు.

గురువు వద్దకు వెళ్ళి సంగతి చెబితే ఆయన, ''ధనార్జనకు వ్యాపారం రాజమార్గమే. అందుకు తగిన పెట్టుబడి, మందీ మార్బలం కావాలి కదా? అది ఒంటరివాడివల్ల సాధ్యం కాదు. నమ్మకస్థులైన మిత్రులు ఒకరిద్దరిని భాగస్వాములుగా చేసుకుంటే, వాళ్ళ సహకారంతో సత్వర అభివృద్ధి సాధించగలవు,'' అని సలహా ఇచ్చాడు.

పట్నానికి తిరిగి వచ్చిన భద్రయ్య, నిదానంగా ఆలోచించి, ఇద్దరు మిత్రులతో మాట్లాడి, తన వ్యాపారంలో వారిని భాగస్వాములుగా చేర్చుకున్నాడు. కొత్తగా పట్నంలోనే మరి రెండు దుకాణాలు తెరిచాడు. వ్యాపారం బాగా పుంజుకున్నది. సుప్రసిద్ధ నగల వర్తకుడు ధనశేఖరుడు తన కుమార్తె కనకవల్లిని భద్రయ్యకిచ్చి పెళ్ళిచేశాడు. వివాహానికి విచ్చేసిన గురువు జ్ఞానభాస్కరుడు నూతన దంపతులను మనసారా ఆశీర్వదించి వెళ్ళాడు.

రోజులు గడవసాగాయి. భద్రయ్యకు కూతురు పుట్టింది. బిడ్డకు అన్నపూర్ణ అని పేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచసాగారు.

వ్యాపారాభివృద్ధి కోసం భద్రయ్య భాగస్వాములతో కలిసి తీవ్రంగా ఆలోచించాడు. తమ దేశంలోని నాణ్యమైన వస్త్రాలను విదేశాలకు ఎగుమతి చేస్తే అధికలాభాలు గడించవచ్చని నిర్ణయించాడు. మరుసటి నెలనుంచే వస్త్రాల ఎగుమతి ఆరంభమయింది.

మూడునెలలు గడిచాక, తమ వస్త్రాలకు సువర్ణద్వీపంలో గిరాకీ ఉన్నదని తెలియడంతో, తమ వద్ద వున్న విలువైన వస్త్రాలను ఓడలోకి ఎక్కించారు. గుమాస్తాలతో ఓడ బయలుదేరింది. అది సువర్ణద్వీపాన్ని సమీపిస్తూండగా అక్కడ పెద్ద భూకంపం వచ్చింది. ఆ ప్రకంపనానికి ఉవ్వెత్తుగా లేచిన సముద్ర తరంగాలకు ఓడ తల్లకిందులై ఉన్నచోటు తెలియకుండా పోయింది.

ఆ వార్త తెలిసిన భద్రయ్యకు తలపై పిడుగు పడ్డట్టయింది. ఆ క్షణం వరకు ఎంతో

స్నేహం పాటించిన భాగస్వాములు ఆగర్భ శత్రువుల్లా ప్రవర్తించ సాగారు. భద్రయ్యకు ఇంటా, బయటా మనశ్శాంతి కరువయింది.

ఆ సమయంలో దేశాటన చేస్తూన్న గురువు జ్ఞానభాస్కరుడు, భద్రయ్యను చూడడానికి వచ్చి, అతని పరిస్థితిని గ్రహించి జాలి పడ్డాడు. అతన్ని ఓదారుస్తూ, ''భద్రయ్యా, ఇలాంటప్పుడే ధైర్యం కావాలి. జీవితంలో జయాపజయాలు సహజం. ఒకానొకప్పుడు ఒక బోయవాడు వృక్షం కొమ్మ మీద కూర్చున్న పావురాల జంటను కొట్టడానికి బాణం గురి పెట్టాడట. దానిని గమనించిన ఆడపావురం, ఎగిరి పోదామని మగపావురాన్ని పిలిచింది. అయితే, మగపావురం తమను తన్నుకు పోవడానికి ఆకాశంలో వృత్తాకారంలో ఎగురు తూన్న డేగను చూపించి, 'వద్దు, ధైర్యంగా వుండు. ఇప్పుడు మనం చేయగలిగిందల్లా ఈ గండంనుంచి కాపాడమని దేవుణ్ణి ప్రార్థించడం ఒక్కటే!' అన్నది. అంతలో బోయ వాడు బాణం వదులుతూ పాముపై కాలువేసి దాని కాటుకు గురవడంతో, బాణం గురి తప్పి, పావురాలమీదుగా ఎగురుతూన్న డేగకు తగిలి అది నేలకు ఒరిగింది. పావురాలు బతికిపోయాయి. చూశావా, మరణ గండం గుప్పిటలో చిక్కుకున్నప్పటికీ, మగ పావురం గుండెనిబ్బరమే వాటిని కాపాడింది. అందువల్ల నువ్వూ ధైర్యంగా ఓర్పువహించు. కాలం మారుతుంది. నీ పరిస్థితి తప్పక మెరుగుపడుతుంది. ప్రతికూల పవనాలు వీచేప్పుడు రెల్లులా తలవంచక తప్పదు. సర్వం కాలాధీనం; మనం కేవలం నిమిత్త మాత్రులమే,'' అన్నాడు.



బేతాళుడు ఇంతవరకు చెప్పి, ''రాజా, మొదట స్వయంకృషి, పట్టుదల అవసరమని భద్రయ్యకు ఉపదేశించిన గురువు జ్ఞాన భాస్కరుడు, ఆఖరికి ఒకపిట్టకథ సాయంతో సర్వం కాలాధీనం, విధిబలీయం అంటూ మెట్టవేదాంతం వల్లించడం విచిత్రంగానూ, పరస్పర విరుద్ధంగానూ లేదా? ఇది ఆయనకు అనుభవం నేర్పిన పాఠమా? లేక వృద్ధాప్యంలో నిస్సహాయత కారణంగా కలిగే నిరాశానిస్పృహల పర్యవసానమా? ఆయన రెండు అభిప్రాయాలలో ఏది సత్యం? ఏది అసత్యం? నా సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''గురువు జ్ఞాన భాస్కరుడి మాటల్లో ఎలాంటి వైరుధ్యమూ లేదు. ఆయన భద్రయ్యకు మొదట, చివర చెప్పిన రెండు విషయాలూ అక్షర సత్యాలే. మనిషి ప్రయత్నం, కృషీ లేనిదే ఎలాంటి ప్రగతీ, అభ్యుదయమూ సాధ్యం కాదు. సర్వం విధిలిఖితం అని కూర్చుంటే మనిషి బతుకు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగానే కాకుండా మరింత దారిద్ర్యానికి దారి తీస్తుంది. అందువల్ల యువహృదయాలకు ప్రాణశక్తిలాంటి ప్రయత్నం, కృషి ప్రాముఖ్యతలను మొదట ఉపదేశించాడు. అదే విధంగా జీవిత పయనంలో అనుకోని అవాంతరాలూ, ఆటంకాలూ, ప్రమాదాలూ ఎదురైనప్పుడు గుండె నిబ్బరంతో ఓర్పు వహించక తప్పదు. ఎందుకంటే – సర్వం, సర్వవేళలా మనిషి అధీనంలో ఉండవు. అలా ఓర్పు వహించేప్పుడు కాలాన్నీ, దైవాన్నీ నమ్మడం మనిషికి మరింత ఆత్మస్థైర్యాన్ని కలిగిస్తుంది. ఆ సంగతే ఆయన చివర చెప్పాడు. రెండూ సత్యాలే. అయితే, ఎప్పుడు దేనిని ఉపయోగించుకోవాలి, అన్న విజ్ఞత లోనే మనిషి వివేకం ఇమిడి ఉన్నది,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : దాసరి మంజుభారతి రచన]






# మైసూరు రాకెట్




దీపావళి అనగానే పిల్లలకు టపాకాయలు గుర్తుకువస్తాయి. ఈ టపాకాయలలో నిప్పు రవ్వల పువ్వులు చిమ్ముకుంటూ జుయ్ మంటూ ఆకాశంలోకి దూసుకు పోయే రాకెట్ చాలా ప్రాచుర్యం కలది. మన 'ఇస్రో', అమెరికాలోని 'నాసా' నుంచి రాకెట్ల సాయంతో శాటలైట్లను అంతరిక్షంలోకి పంపారని మనం వింటూ ఉంటాం. చదువుతూ ఉంటాం. అయితే, రాకెట్లను శతాబ్దాల క్రితం ఆయుధాలుగానూ ఉపయోగించేవారు.

ఇలాంటి రాకెట్లు ప్రయోగించడంలో మనదేశం అగ్రగామి అనీ, మైసూరు టిప్పుసుల్తాన్ 18వ శతాబ్దం చివరి దశకాలలో వీటిని తయారుచేశాడనీ మీకు తెలుసా? మైసూరు సైన్యంలో 5000 మంది సైనికులతో 'రాకెట్ విభాగం' ఉండేది. రాకెట్ల పరిమాణం, ఎగరవలసిన ఎత్తు, వెళ్ళవలసిన దూరం, ఛేదించవలసిన గమ్యం మొదలైన అంశాల ఆధారంగా వాటిని అమర్చే సాంకేతిక పరిజ్ఞానం సైనికులకు అందించేవారు. 'మైసూరు రాకెట్' సగటున 2.4 కి.మీ. దూరం వెళ్ళగలిగేదని చెబుతారు. అదే కాలఘట్టంలో ఇంగ్లాండు రాకెట్ వెళ్ళగలిగిన గరిష్ఠ దూర పరిమితి 1 కి.మీ. మాత్రమే. అందువల్ల తెలివైన ఆంగ్లేయులు మైసూరు యుద్ధాలలో తమపై ప్రయోగించబడిన రాకెట్లను సేకరించి వాటిని పరిశోధించడానికి ఇంగ్లాండుకు పంపేవారు. తమ రాకెట్లను మరింత శక్తివంతంగా తయారుచేయడానికి అవి ఉపయోగపడగలవని వారు భావించారు. ఉపయోగ పడ్డాయి కూడా.



# మేకల హనుమంతు

రంగాపురంలోని హనుమంతు తన ఇరవై యవ యేట ఒక పడవ ప్రమాదంలో తల్లి దండ్రులను పోగొట్టుకున్నాడు. బతుకు తెరువుకు దిక్కుతోచక నిలబడ్డ హనుమంతును, అతడి తండ్రి స్నేహితుడు నాగయ్య చేరదీసి ఆదరించాడు.

నాగయ్య సలహా ప్రకారం ఆయన దగ్గరే అప్పుతీసుకుని హనుమంతు నాలుగు మేక పిల్లల్ని కొన్నాడు. వాటికి బాగా తిండిపెట్టి మేపాడు. అవిపెద్దయ్యాక వాటిని అమ్మగా వచ్చిన డబ్బుతో నాగయ్య అప్పు తీర్చేయడమే గాక, మరొక పది మేకపిల్లల్ని కొని మేపడం మొదలు పెట్టాడు. తిండికీ, బట్టకూ ఎలాంటి లోటూ లేకుండా రోజులు గడవసాగాయి. కొన్నాళ్ళకు హనుమంతు పేరు మేకల హను మంతుగా మారిపోయింది.

రెండు మూడేళ్ళలో అతని వ్యాపారం మరింత అభివృద్ధి చెందింది. ఒక పేదింటి అమ్మాయి మంగమ్మను పెళ్ళిచేసుకున్నాడు. ఆమెకు జంతువులన్నా, పక్షులన్నా ప్రాణం. భర్త చేస్తూన్న మేకల వ్యాపారం ఆమెకు అసలు నచ్చలేదు. కొత్త కాబట్టి భర్తను ఏమీ అనలేక, తనూ సర్దుకుపోలేక సతమతమవుతూ చాలా ఇబ్బంది పడసాగింది.

కొన్ని రోజులు గడిచాక ఒకనాడు ధైర్యం చేసి, భర్తతో వ్యాపార విషయం మెల్లగా ప్రస్తావించింది. అయితే అతడు, ''ఇది వ్యాపారం, తప్పదు,'' అని ముక్తసరిగా జవాబివ్వడంతో మరేమీ మాట్లాడలేకపోయింది.

ఒకనాడు సంతకువెళ్ళి వచ్చిన భర్తస్నానానికి నీళ్ళు తోడి, అన్నం వడ్డిస్తూ, ''అంత ప్రేమగా పెంచిన ఆ మేకను కసాయివాడికి ఎలా అప్పగించావయ్యా? నీకు మనసెలా ఒప్పింది?'' అని అడిగింది మంగమ్మ.

''అది అంత లావుగా, బొద్దుగా ఉంది గనకే మంచి ధర పలికింది,'' అన్న భర్త

కోటమర్తి రాధాహిమబిందు

మాటకు అడ్డు తగులుతూ, ''ఇలాంటి కసాయిపని చేస్తున్నావు గనకే, ఇంకా మనకు పిల్లలు పుట్టలేదు. అయినా బతకడానికి ఎన్ని మార్గాలు లేవు? రెండెకరాల పొలం కౌలుకు తీసుకుందాం. దాంతో పాటు రెండు గేదెలు కొనుక్కుంటే, పాలవ్యాపారం చేసుకుంటూ హాయిగా బతకవచ్చు,'' అన్నది మంగమ్మ.

''చాలు నీ బోడిసలహా. సంపాయించి తెచ్చి ఇస్తున్నాను కదా. ఇంట్లో కూర్చుని ఎన్నయినా చెప్పగలవు. నోరు మూసుకుని వెళ్ళి పడుకో,'' అంటూ ఇంత తిని వెళ్ళి పడుకున్నాడు హనుమంతు.

మరునాడు నిద్రలేస్తూనే హనుమంతు భార్యతో, ''గంగాపురం భూస్వామి కొడుక్కి రేపు పుట్టింటుకలు తీస్తున్నారట. గ్రామ దేవతకు బలి ఇవ్వడానికి మేకపిల్ల కావాలని కబురు చేశారు. తెల్లవారేసరికి బలి ఇవ్వాలట. రాత్రికి రాత్రే తోలుకు రమ్మన్నారు. మంచి బేరం. కొట్టంలో సరైన మేకపిల్ల లేదు. నువ్వు మేపుతున్నావు కదా. దాన్ని సాయంకాలం తోలుకుపోతాను,'' అన్నాడు.

ఆ మాట వినగానే మంగమ్మ మనసు విలవిలలాడింది. ఒక కంటి చూపు సరిగా లేదని ఆ మేకపిల్లపై కనికరంతో మంగమ్మ దాన్ని బిడ్డలా పెంచుతున్నది. ఇప్పుడు దాన్ని అమ్ముతానంటున్నాడు భర్త. వద్దని బతిమలా డింది. కానీ హనుమంతు ఏమాత్రం పట్టిం చుకోలేదు. ''కావాలంటే నువ్వు మరొక మేక పిల్లను పట్టి సాకు,'' అంటూ ఆ సాయం



కాలం మేకపిల్లను తోలుకుని గంగాపురం బయలుదేరాడు.

ఇంతకు ముందు ఇలా రాత్రి వేళ రెండు మూడుసార్లు మాత్రమే వెళ్ళాడు. మామూ లుగా ఉదయమే వెళుతూ ఉంటాడు. ఆ రోజనగా హఠాత్తుగా ఉరుములు మెరుపు లతో మబ్బులు పట్టడంతో మరీ చీకటిగా ఉంది. మామూలు దారిగుండా వెళితే, ఎక్కువ సమయం పడుతుందని అడ్డుదారి గుండా నడవసాగాడు. అంత చీకటి దారిలో నడు స్తూన్న అతడికి మొదటిసారిగా భయం వేసింది. అడుగుల వేగం పెంచాడు.

మార్గమధ్యంలో దారి పక్కన గట్టులేని ఒక నేలబావి ఉంది. తొందరగా వెళ్ళాలన్న ఆదు ర్దాలో, హనుమంతు ఆ బావి సంగతి మరి చాడు. దాని పక్కగా వెళుతూ కాలుజారి ఆ

బావిలో పడిపోయాడు. భయంతో కేకలు వేశాడు. లోతుబావి కావడంతో అతడి గొంతు దాటిన కేకలు బయటకు వినిపించలేదు.

హనుమంతు వెంట అంతదూరం వచ్చిన మేకపిల్ల దీనంగా బావి చుట్టూ తిరుగుతూ, బావిలోకి తొంగి చూస్తూ, తన యజమాని కోసం అరవసాగింది. తన కోసం మేకపిల్ల పడుతూన్న ఆరాటం గమనించిన హనుమంతు మనసు కలుక్కుమన్నది. బావి లోపల ఏదో పట్టు దొరికితే, దాన్ని పట్టుకుని బిక్కు బిక్కుమంటూ గడిపాడు.

తెలతెలవారుతూండగా మేకపిల్ల అరుస్తూ అటూ ఇటూ పరిగెత్తి, ఇద్దరు ముగ్గుర్ని వెంటబెట్టుకు వచ్చి బావిలోకి తొంగి చూస్తూ అరిచింది. దాన్ని చూసి మరికొందరు పోగయ్యారు. పరిస్థితిని గ్రహించి, వాళ్ళందరూ కలిసి హనుమంతును బయటకు తీశారు.

బయటకు వచ్చీ రాగానే హనుమంతు మేకపిల్లను కౌగిలించుకుని భోరున ఏడ్చాడు. తనని అలాగే వదిలేసి మేకపిల్ల వెళ్ళిపోయి దాని ప్రాణాలు కాపాడుకుని వుండవచ్చు. అయినా, అది అలా చేయలేదు. తనను కాపాడాలనుకున్నది. దాన్ని గురించి ఆలోచిస్తూంటే హనుమంతుకు కన్నీళ్ళు ఆగలేదు. తనను బావి నుంచి బయటకు తీసినవారికి కృతజ్ఞతతో చేతులెత్తి మొక్కి, మేకపిల్లను ప్రేమగా నిమిరి వెనుదిరిగి ఇంటిదారి పట్టాడు.

మేకపిల్లతో తిరిగి వచ్చిన భర్తను ఆశ్చర్యంగా చూసింది మంగమ్మ.

''ఎప్పటినుంచో పొరుగూరు వెంకటసామి వీటన్నిటినీ అమ్మమంటున్నాడు. అతడు ఈ మేకల వ్యాపారం చేసుకుంటాడట. రేపే వీటిని అమ్మేస్తున్నాను. నువ్వు చెప్పినట్టే పొలం కౌలుకు తీసుకుందాం. పాల వ్యాపారం చేసుకుందాం. దీన్ని మాత్రం నాతోపాటే ఉంచుకుంటాను. ఇప్పటికి ఇదే నా సంతానం,'' అంటూ హనుమంతు మేకపిల్లను దగ్గరికి తీసుకున్నాడు. మంగమ్మకు ఏదీ అంతుబట్టక, ''ఇంతకూ ఏం జరిగింది?'' అని భర్తను విస్మయంతో అడిగింది. మేకనే కళ్ళనిండా చూసుకుంటూ రాత్రి జరిగిన విషయం భార్యకు వివరించాడు హనుమంతు.



# అమ్మ

చలపతికి ఐదేళ్ళ వయసులో తండ్రి చనిపోతే, తల్లి అలివేలమ్మ విద్యాబుద్ధులు నేర్పి పెంచి పెద్ద చేసింది. కొడుక్కు జమీందారు దివాణంలో ఉద్యోగం రాగానే, వనజ అనే చక్కని అమ్మాయిని చూసి పెళ్ళి చేసింది. చలపతి కొద్ది కొద్దిగా డబ్బు చేర్చి కొన్నాళ్ళకు ఒక ముచ్చటయిన ఇల్లు కట్టాడు. ఆ ఇంటికి తన తల్లి అలివేలమ్మ పేరు పెట్టాలని నిర్ణయించి, ఆ మాట భార్యకు చెప్పాడు. అయితే, ఆ ఇంటికి తన పేరు పెడితే బావుంటుందని భార్య వనజ ఆశతో సూచించింది.

అష్ట కష్టాలు పడి తనను పెంచి ప్రయోజకుణ్ణి చేసిన తన తల్లి పేరు పెట్టాలా? తనను పంచప్రాణాలుగా భావిస్తూన్న భార్య కోరికను మన్నించి ఆమె పేరు పెట్టడమా? అన్న సందిగ్ధంలో పడ్డాడు చలపతి. ఎటూ తేల్చుకో లేక తన స్నేహితుడు రాఘవుణ్ణి చూసి, తన సమస్యను చెప్పాడు.

''దీనికింత బాధ ఎందుకు? నీ తల్లి ప్రేమ నాకు తెలియనిదా? మీ ఇంటి గోడమీద మీ అమ్మ పేరుకు బదులు కేవలం 'అమ్మ' అని రాయించు. అది నీకు నీ తల్లిని గుర్తు చేస్తుంది. నీ పిల్లలు దాన్ని చూసి వాళ్ళ అమ్మ ఇల్లు అనుకుంటారు. దాంతో నీ భార్య కూడా సంతోషిస్తుంది,'' అన్నాడు రాఘవుడు.

''మంచి సలహా ఇచ్చావు రాఘవా. 'అమ్మ'కు మించిన పేరు లేదు,'' అంటూ చలపతి ఇంటికేసి నడిచాడు.

ఇప్పుడు అతడి కొత్త ఇంటి పేరు 'అమ్మ'. ఆ పేరును చూసి చలపతి ఇంట్లో వాళ్ళే కాకుండా, ఆ వీధిలోని వాళ్ళందరూ సంతోషించారు. – కంచుమల్లి వేంకట కృష్ణారావు



# చందమామ కబుర్లు

## నిరంతరాయంగా గానం



గత నవంబర్‌లో ఇండూర్‌కు చెందిన ఆకాంక్ష జాచక్ తన 16వ జన్మదినంనాడు పాడడం ప్రారంభించి నిరంతరాయంగా 61 గంటలసేపు పాడి గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో స్థానం సంపాదించింది. ఆ అమ్మాయి మరాఠీ, హిందీ పాటలు పాడింది. నలుగురు సంగీతకారులు ఆమెకు గాత్ర సహకారం అందించారు. ఆమె తల్లిదండ్రులు, బంధు మిత్రులు, శ్రేయోభిలాషులు మూడు పగళ్ళూ, రాత్రులూ ఆమె దగ్గరేవుండి ఉత్సాహం కలిగించారు. నిర్ణీత సమయాలలో ఆమెను పరీక్షిస్తూ డాక్టర్లు కూడా అక్కడే ఉన్నారు. ఆమె మూడు రోజులపాటు ఘనాహారం తీసుకోకుండా, నిమ్మరసం తాగుతూ గడిపింది.

## ఆటోరిక్షాల ఊరేగింపు



కేరళరాష్ట్రం కొచ్చిన్ మాట్టన్‌చేరి నుంచి పశ్చిమ బెంగాల్ డార్జిలింగ్ వరకు ముప్పై అయిదు ఆటోరిక్షాల ఊరేగింపు జరిగింది. ఆటో డ్రైవర్లందరూ అమెరికా, ఇంగ్లాండ్, స్పెయిన్, జర్మనీ దేశాలకు చెందినవారే. వాళ్ళందరూ కొత్త ఆటోలలో గత డిసెంబర్ 28వ తేదీ బయలుదేరి 3000 కి.మీ. దూరాన్ని, 20-22 రోజులలో ప్రయాణంచేసి గమ్యాన్ని చేరుకున్నారు. ఊరేగింపు చివరి రోజున ఆటోరిక్షాలను డార్జిలింగ్‌లోని నిరుద్యోగ యువకులకు కానుకగా ఇచ్చారు!

## శాంతి కోసం

ఐక్యరాజ్య సమితి అభ్యర్థన మేరకు భారతీయ సైన్యానికి చెందిన నూటముగ్గురు మహిళా సైనికులు గత ఫిబ్రవరిలో శాంతి చర్యల కోసం లైబీరియాకు వెళ్ళారు. వారికి కమాండర్ సీమా ధుండీ నాయకత్వం వహించగా వారి వెంట ఇరవై రెండు మంది పురుష సైనికులు కూడా వెళ్ళారు. వారి కార్యకలాపాలలో లైబీరియన్ నేషనల్ పోలీస్‌కు చెందినపురుషులు కూడా చేతులు కలిపారు. ఇండియా నుంచి మహిళా పోలీసులు రావడం చూసిన స్థానిక మహిళలు పోలీసు శాఖలో చేరడానికి ఉత్సాహం కనబరచారు.



## బీహారు జానపద కథ

# పందిరిమంచం సైనిక భటులు!

పేరుమోసిన వడ్రంగి పీయారాంఆచారి ఒక్కగా నొక్క కొడుకు సీతారాం. వాడు చాలా తెలివైన కుర్రవాడు. తండ్రి పనిచేయడం వాడు ఎంతో ఆసక్తితో గమనించేవాడు. తన బిడ్డ బాగా చదువు కుని, గొప్ప పండితుడు కావాలన్నది పీయారాం ఆశ. అయితే, సీతారాం బడికి వెళ్ళకుండా ఇంటిపట్టునే ఉంటూ తండ్రి చేసే అందమైన బొమ్మలు, కుర్చీలు, మంచాలు, తలుపులు, కిటికీలు మొదలైనవాటిని పరిశీలనగా చూస్తూ గడపడానికే ఇష్టపడేవాడు.

పీయారాం తయారుచేసే వస్తువులకు మంచి గిరాకీ ఉండేది. వాటిని అమ్మగా వచ్చిన డబ్బుతో ముగ్గురే వున్న పరిమిత కుటుంబాన్ని ఒకరకంగా నెట్టుకు రాసాగాడు. అందువల్ల పీయారాం, అతని భార్య పిల్లవాణ్ణి గురించి పెద్దగా పట్టించు కోలేదు. తండ్రి పనిచేసే చోటు నుంచి కొంచెం సేపు ఎటైనా వెళితే చాలు, సీతారాం ఉలి, సుత్తి లాంటి పనిముట్లను తీసుకుని అక్కడ పడివున్న కొయ్యముక్కలతో బొమ్మలు చెక్కడానికీ, వస్తు వులు తయారు చేయడానికీ ప్రయత్నించేవాడు. అలాగే వాడు పెరిగి యౌవనంలో అడుగుపెట్టాడు.

ఇలా వుండగా పీయారాంకు హఠాత్తుగా జబ్బు చేసి మరణించాడు. కుటుంబంలో పెద్ద దిక్కు లేకపోయింది. ఇంటి నుంచి వడ్రంగం పనులు చేసే శబ్దం నిలిచి పోయింది. ఆదాయం లేక పోవడంతో పూట గడవడమే దుర్భరమై పోయింది. మూడో రోజు ఉదయం కొడుకును నిద్రలేపిన తల్లి, ''మనం, ఇకపై ఎలా బత కడం?'' అని అడిగింది. సీతారాం లేచి కూర్చుంటూ, ''నేను మా నాన్నలాగే వడ్రంగం పనిచేసి డబ్బులు సంపాయిస్తాను, విచారపడకమ్మా'' అన్నాడు.

''మంచిదే. కాని నువ్వు వడ్రంగం నేర్చుకో లేదే,'' అన్నది తల్లి.

''మానాన్న అన్నేసి రకాల వస్తువులు చేస్తూంటే అన్నాళ్ళు చూస్తూ వచ్చాను కదా? ప్రయత్నిస్తే వాటిలో కొన్నింటినైనా చేయగలననుకుంటు న్నాను,'' అన్నాడు సీతారాం ఎంతో ఆత్మవిశ్వాసంతో.





తప్పక ఇష్టపడతారు. ఇలా ఆలో చించిందే తడవుగా ఆ మంచాన్ని తయారు చేయడంలో నిమగ్నుడ య్యాడు. కొన్నాళ్ళకు అతడు అనుకున్న రీతిలో అద్భుతమైన మంచం తయారయింది. తన మిత్రులకూ, పరిచయస్థులకూ దానిని చూపుతూ, ''ఈ మంచం మీద పడుకునే వ్యక్తి చాలా అదృష్ట వంతుడు!'' అని చెప్పసాగాడు.

ఆ మాట ఈనోట ఆనోట పడి రాజు పరేష్‌నాథుడి వరకు వెళ్ళింది. రాజోద్యోగులలో ఒకడు, రాజుకు దానిని గురించి చెప్పి, ''ఆ మంచం మీద పడుకుని నిద్రించేవారిని నాలుగు వైపులనున్న నలుగురు సైనిక భటులు కాపలా కాస్తారు, ప్రభూ!'' అన్నాడు.

ఆరోజు నుంచే అతడు పీటలు, తలుపులు, కిటికీలు చేయడం మొదలు పెట్టాడు. ఇంటి నుంచి మళ్ళీ కొయ్యపనిచేసే శబ్దాలు వినిపిం చడం ఆరంభమయింది. అటుగా వచ్చే పోయే వాళ్ళు ఆ శబ్దాలు విని తమకు కావలసిన వస్తు వులను సీతారాంతో చెప్పి చేయించుకోసాగారు. అతని పనితనం చూసి అబ్బురపడసాగారు. అతడు తయారు చేసే వస్తువులను అమ్మగా వచ్చే డబ్బుతో తల్లీకొడుకులు తిండికీ, బట్టకూ కష్టంలేకుండా రోజులు గడపసాగారు.

ఊళ్ళో వాళ్ళు చెప్పే వస్తువులను తయారు చేయడానికి పోను, సీతారాంకు చాలా తీరిక ఉండేది. అలాంటి సమయాల్లో అతడు ఒక కొత్తరకం పందిరిమంచం తయారుచేయడానికి ఆలోచించడం ప్రారంభించాడు. అతని మన సులో కొన్ని అద్భుతమైన ఆలోచనలు తోచాయి. దాన్ని మామూలు పందిరిమంచంలా తయారు చేయకూడదు. పందిరిమంచానికి నాలుగు వైపులా తెరలు వేలాడదీయడానికి నాలుగు స్తంభాలను ఉంచకుండా సైనికుల్లా కనిపించే మానవరూపాలను చెక్కి నిలబెట్టాలనుకున్నాడు. అలాంటి మంచాన్ని రాజువంటి గొప్పవాళ్ళు

ఆ సమయంలోనే రాజు రకరకాల సమస్య లతో సతమతమవుతున్నాడు. ఒకసారి ఏదో రాక్షసి తనను చంపుతున్నట్టు రాజుకు కల వచ్చింది. అప్పటినుంచి ఆయనకు సరిగా నిద్ర పట్టడం లేదు. మరో మూడు రోజుల తరవాత ఆస్థాన జ్యోతిష్కుడు వచ్చి, రాజగృహంలోకి కాల సర్పం జొరబడింది; రాజుకు సర్పగండం ఉందని చెప్పి వెళ్ళాడు. తమ రాజ్యం మీదికి దండెత్త డానికి పొరుగురాజు ఆయత్తమవుతున్నట్టు గూఢ చారులు వార్తను తీసుకువచ్చారు. ఒకనాటి అప రాత్రి సమయంలో, ఖజానా సమీపంలో కొందరు దొంగలు తచ్చాడుతూ ఉండడం కాపలా భటులు గమనించారు.

ఒక్కసారిగా ఇన్ని సమస్యలు వచ్చి పడడంతో రాజుకు మనశ్శాంతి కరువయింది. మంత్రిని సంప్రదించాడు. ''నాలుగు వైపులా కొయ్య సైనిక భటులున్న ఆ మంచం నాకు కొంత మనశ్శాంతి కలిగించగలదని ఆశిస్తున్నాను.

నువ్వు సీతారాంను రహస్యంగా కలుసుకుని దాని ధర ఎంతో తెలుసుకుని రా,'' అని చెప్పి మంత్రిని పంపాడు.

మంత్రి తన వద్దకు రాగానే, సీతారాం ఆశ్చర్య పోయాడు. తాను ఆ మంచాన్ని అమ్మననీ, రాజుకు కానుకగా ఇస్తాననీ; దానిని ఉపయోగించాక కావాలంటే రాజు తనకు ఏదైనా పారితోషికంగా ఇవ్వవచ్చుననీ చెప్పాడు. అయినా, రాజుగారికి ఆ మంచంతో వున్న అవసరం గురించి మంత్రి అతనితో చెప్పలేదు.

మంత్రి ఆ మంచం రాత్రికే రాజభవనానికి చేరే ఏర్పాట్లు చేశాడు. ఆ మంచాన్నీ, నాలుగు వైపులా అందంగా చెక్కబడిన భటుల బొమ్మలనూ చూసి రాజు పరమానంద భరితుడయ్యాడు. రాజు దాని మీద సక్రమంగా పడుకునేంతవరకు మంత్రి శయనమందిరంలోనే ఉండి వెళ్ళాడు. రాజుకు త్వరలోనే సుఖంగా నిద్రపట్టింది.

అర్ధరాత్రి సమయంలో, నాలుగు భటుల బొమ్మలలో ఒక దానికి ప్రాణం వచ్చింది. ఆ భటుడు రాజుగారి శయన మందిరంలోకి జొరబడుతూన్న రాక్షసిని చూశాడు. వెంటనే దాన్ని వెలుపలికి లాక్కుపోయి కత్తి దూసి హతమార్చాడు. ఆ తరవాత తన యధాస్థానాన్ని చేరుకుని తాను చేసిన సాహస కృత్యాన్ని మిగిలిన ముగ్గురికీ తెలియజేశాడు. ఆ సమయంలో రాజుకు మెలకువ వచ్చి ఆ భటుడి మాటలు విని అలాగే పడుకున్నాడు. తెల్లవారాక భవనానికి వెలుపల రాక్షసి శవం పడివున్నట్టు రాజుగారికి సమాచారం అందింది. ఆ రాక్షసిని ఎవరు ఎప్పుడు ఎలా హతమార్చారన్న సంగతి రాజుకు తప్ప మరెవ్వరికీ తెలియదు. అతడు మంత్రిని పిలిపించి రాత్రి జరిగిన సంగతి వివరించాడు. ఒక సంచీ నిండుగా బంగారు నాణాలు ఇచ్చి సీతారాంకు అందజేయమన్నాడు.

కొన్నిరోజులు గడిచాయి. ఒకనాటి అర్ధరాత్రి సమయంలో మరొక బొమ్మభటుడు సజీవుడై కాపలా కాస్తున్నప్పుడు పాము బుసకొట్టడం విన్నాడు. రాజు మంచం కేసి వస్తూన్న భయంకరమైన సర్పాన్ని చూడగానే, దాని తోకపట్టుకుని చరచరా భవనం వెలుపలికి లాక్కుపోయి చంపి విసిరి కొట్టాడు. అతడు తిరిగివచ్చి తాను చేసిన పనిని మిగిలిన భటులకు వివరిస్తూండగా రాజు నిద్రనటిస్తూ ఆ మాటలు విన్నాడు.

తెల్లవారాక రాజును చూడవచ్చిన మంత్రి, రాజభవనం ద్వారానికి అవతల ఒక చచ్చిన పాము పడివుందని కాపలాభటులు చెప్పిన విషయం తెలియజేశాడు. ఆరోజు మధ్యాహ్నం రాజు, ఆస్థాన జ్యోతిష్కుణ్ణి పిలిపించాడు. అతడు ఏవో లెక్కలు గణించి, రాజుగారికి సర్పగండం





వచ్చి, ఖజానా దొంగతనాన్ని తాను ఎలా అడ్డుకున్నదీ మిగిలిన ముగ్గురు భటులకు వివరించాడు. రాజువాళ్ళ సంభాషణ విని శయన గృహం నుంచి వెలుపలికి వచ్చి భటులను పిలిచి ఖజానా వద్దకు వెళ్ళి చూడ మన్నాడు. భటులు వెళ్ళి, తిరిగి వచ్చి అక్కడ ఇద్దరు దొంగలు కాళ్ళు చేతులు బంధించబడి ఉన్నారని చెప్పారు. రాజు దొంగలకు కారాగార శిక్ష విధించాడు. తెల్లవారాక మంత్రి తనను చూడడానికి వచ్చినప్పుడు మంచం భటుడు ఖజానా దొంగత నాన్ని అడ్డుకున్న వైనం గురించి రాజు ఆయనకు వివరించి, సీతా రాంకు మరొక సంచీ నాణాలు పంపాడు.

తొలగిపోయిందనీ, ఇన్నాళ్ళు రాజభవనంలో దాక్కునివున్న సర్పం ప్రస్తుతం అక్కడ లేదనీ చెప్పాడు. ఆ తరవాతే రాజు అతడికి రాజభవన ద్వారం వద్ద పడివున్న చచ్చిన పామును గురించి చెప్పాడు. రాజు మంత్రి ద్వారా సీతారాంకు మరో సంచీ నిండుగా బంగారు నాణాలు పంపాడు.

మరికొన్ని రోజుల తరవాత మూడవ మంచం భటుడు ప్రాణాలతో లేచి శయన మందిరాన్ని వదిలి వెలుపలికి వచ్చాడు. రాజుగారి ఖజానా సమీపంలో ఏవో వింత ధ్వనులు రావడం గమనించాడు. దగ్గరకి వెళ్ళి చూస్తే ఇద్దరు దొంగలు ఖజానా తాళాలు పగలగొట్టడానికి ప్రయత్నించడం కనిపించింది. భటుడు వాళ్ళను ఒడుపుగా పట్టుకుని కాళ్ళుచేతులు బంధించి కిందపడతోశాడు.

భటుడు రాజుగారి శయన గృహానికి తిరిగి

పొరుగురాజు తమ రాజ్యం మీద దాడి చేయ గలడన్న వదంతులు ఎక్కువయ్యాయి. పొరుగు రాజ్యం సైనికులు మారువేషాల్లో రాజ్యంలో ప్రవేశించడానికి ప్రయత్నిస్తున్నారన్న సమాచా రాన్ని గూఢచారులు తీసుకువచ్చారు. అవన్నీ రాజుకు విచారం కలిగించినప్పటికీ తన మంచం మీది భటులు ఈ సమస్యకు కూడా ఏదైనా పరిష్కారం చూపి సాయపడగలరన్న ఆశ ఆయ నలో చిగురించింది. అందువల్ల రాజ్య రక్షణ గురించి అంతగా దిగులుపడకుండా హాయిగా నిద్రపోసాగాడు.

ఒకనాటి రాత్రి ఏమి జరుగుతున్నదీ రాజుకు తెలియదు. మంచం మీది నాలుగవ భటుడు ప్రాణాలతో లేచి, శయనగృహం నుంచి వెలు పలికి వచ్చి, మంత్రి భవనం కేసి నడిచాడు. అను మానాస్పద స్థితిలో అక్కడ ఒక వ్యక్తి తచ్చాడుతూ

ఉండడం చూశాడు. అతడు పొరుగు దేశపు గూఢచారి. మంత్రిని హతమార్చినట్టయితే, రాజ్యం అల్లకల్లోలమవుతుంది. ఆ సమయంలో దండెత్తి వచ్చినట్టయితే, సులభంగా జయించ వచ్చున్న పథకంతో పొరుగురాజు ఆ గూఢచారిని పంపాడు. మంచం భటుడు ఆ గూఢచారిని సమీపించడంతో గొడవ ఆరంభమయింది. ఒకరినొకరు కొట్టుకుంటూ పెనుగులాడసాగారు. ఆ శబ్దం విని మంత్రి లేచి వెలుపలికి వచ్చాడు. మంత్రి అంగరక్షకులు వారిని విడదీశారు. అక్కడి భటుడు తమ సైన్యంలోని వాడుకాడని గ్రహించి, మంత్రి ఆశ్చర్యపోయాడు. అతడు రాజుగారి శయనగృహం మంచం మీది కొయ్య భటుడి పోలికతో కనిపించడంతో, ''నువ్వు....'' అని మంత్రి అర్థోక్తిగా ఆగాడు.

''అవును నేను పందిరి మంచం సైనిక భటులలో ఒకణ్ణి. పట్టుబడ్డ వీడు శత్రుదేశపు గూఢచారి. మిమ్మల్ని హతమార్చడానికి వచ్చాడు. నేను నా స్థానానికి తిరిగి వెళతాను. మేము సదా సర్వ వేళలా రాజుగారి సేవకు సంసిద్ధులమై ఉన్నాం,'' అంటూ వెనుదిరిగి భటుడు మాయమై పోయాడు.

గూఢచారిని కారాగారంలో వేయమని ఆజ్ఞాపించి, మంత్రి రాజును చూడడానికి హుటాహుటిగా బయలుదేరాడు. మంత్రి చెప్పినదంతా విన్న రాజు, ''మంచం మీది సైనిక భటులు మన ఇద్దరి ప్రాణాలూ కాపాడారు. మన ఖజానాను రక్షించారు. పొరుగు రాజ్యం దాడి నుంచి మన రాజ్యాన్ని కూడా కాపాడారు. అలాంటి వారి సాయం వుంటే మన కెలాంటి ప్రమాదమూ రాదు. కావాలంటే మనమే పొరుగు రాజ్యాల మీదికి దండెత్తవచ్చు. అయినా, అంతకు ముందు ఆ మంచాన్ని తయారు చేసిన వడ్రంగిని నేను చూడాలి,'' అన్నాడు.

మంత్రి సీతారాంను పిలిపించాడు. రాజు సంతోషంగా అతన్ని కౌగిలించుకుని సభికులకు అతడు తయారుచేసిన మంచం గురించి వివరించి, ''నేను ఇతన్ని మన ఆస్థాన వడ్రంగిగా నియమిస్తున్నాను, ఇకపై ఇతడు సీతారామాచారిగా పిలవబడతాడు,'' అన్నాడు.

ఆ మాటకు సభికులు అమితోత్సాహంతో హర్షధ్వానాలు చేశారు.

విలువైన కానుకలతో, భటుల రక్షణతో ఇంటికి వచ్చిన సీతారామాచారిని చూసిన తల్లి ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. ''అంటే, నువ్వు ఇప్పుడు ఆచారివయ్యావన్న మాట!'' అన్నది ఆనందబాష్పాలతో.



# చందమామ ఇండియా క్విజ్ - 5

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

సెలవుల్లో వివిధ ప్రాంతాలు పర్యటించి తిరిగి వచ్చినా, ఇంకా కొన్ని ప్రాంతాలు చూసివుంటే బావుండేది అనుకుంటున్నారు కదూ. సెలవులు ముగిసీ ముగియకుండా ఉన్న ఈ తరుణంలో ఈ నెల క్విజ్‌లో పాల్గొనండి.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్-5 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. జూన్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. ఆగస్టు 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. సంతానం లేని అక్బర్ చక్రవర్తి ఒక సూఫీ సాధువు దీవెనలు అర్థించాడు. కొడుకు పుట్టాక అక్బర్ ఆ సాధువుకు ఒక స్మారకచిహ్నం నిర్మించాడు. అది ఎక్కడ ఉన్నది?
2. అధునాతన టెలిస్కోప్ వంటి పరికరాలు లేవుగాని, రెండు నగరాలు అబ్సర్వేటరీల కారణంగా ప్రసిద్ధిగాంచాయి. అవి ఏవి?
3. జాతక కథలు కుడ్యచిత్రాలుగా ఎక్కడ చిత్రించబడ్డాయి?
4. ఒక జాతీయ నాయకుణ్ణి జైల్లోపెట్టడానికి ఒక భవనం జైలుగా మార్చబడింది. ఆ భవనం ఏది? నాయకుడు ఎవరు?
5. చాలా ఎత్తయిన ప్రదేశంలో ఉన్న హిందువుల యాత్రాస్థలం ఏది?
6. గౌతమబుద్ధుడు ప్రప్రథమంగా తన బోధనలను ప్రసంగించిన స్థలం ఏది?
7. బిందుసాగర్ ఎక్కడ ఉన్నది?
8. క్రైస్తవ మత ప్రచారకుడు సెయింట్ థామస్ ప్రాణత్యాగం చేసిన క్రైస్తవ యాత్రా స్థలం ఎక్కడ ఉన్నది?



# అంతఃపుర రహస్యం

ధర్మపురి రాజ్యం రాజు శివనాగసేనుడికి పట్టమహిషి మణిచంద్రిక అంటే పంచ ప్రాణాలు. ఎన్నో మంచి లక్షణాలున్న మణి చంద్రికకు ఒకటే బలహీనత. మనసులో ఏ రహస్యమూ దాచుకోజాలదు.

వివాహమైన కొత్తలో ఆ విషయం గ్రహిం చిన శివనాగసేనుడు మణిచంద్రికతో, ‘‘నమ్మ కస్థురాలైన ఒక అంతరంగిక చెలికత్తెతో నీ రహస్యాలు చెప్పుకో. నీ మనసు తేలికవు తుంది. రహస్యం బయటకు పొక్కకుండానూ ఉంటుంది,'' అని సలహా ఇచ్చాడు.

అప్పుడు మణిచంద్రిక, ‘‘అటువంటి నమ్మకస్థురాలు ఎవరో కూడా మీరే ఎంపిక చేస్తే బావుంటుంది కదా,'' అంటూ కొంత మంది చెలికత్తెల పేర్లు చెప్పింది. వారి మీద నిఘా ఏర్పాటు చేసిన శివనాగసేనుడు, మణిచంద్రిక పుట్టింటి నుంచి వచ్చిన దాసి మంజరిని ఎంపిక చేశాడు.

అప్పటినుంచి మహారాణి తన మనసు లోని భావాలను మంజరితో పంచుకునేది. వాటిలో అంతఃపుర రహస్యాలు కూడా ఉండేవి. అయితే, మంజరి మహారాణి తనతో చెప్పిన అంతఃపుర రహస్యాలను ఏనాడూ, ఎవరి దగ్గరా వెల్లడించేది కాదు. ఆ విషయం ఎరిగిన మహారాణి, మంజరిని విలువైన కానుకలతో సత్కరించేది. తమ ఎంపికలో పొరబాటు దొర్లనందుకు మహారాజు కూడా ఎంతో సంతోషించేవాడు.

ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి. వృద్ధా ప్యంలో అడుగు పెడుతూన్న మంజరికి ఒక సారి ఆరోగ్యం చెడింది. రాజవైద్యులు వైద్యం చేసినా ఎలాంటి ఫలితం కనిపించలేదు. హఠాత్తుగా కన్ను మూసింది. మంజరి మరణా నికి మహారాణి కలత చెందింది. అంతరంగిక విషయాలు చర్చించడానికి మనిషి దొరక్క, ఆమె మరింత దిగులు చెందింది. ఆ విషయం

ఎన్. శివనాగేశ్వరరావు



గ్రహించిన మహారాజు, ''మనసులోని మాట చెప్పుకోడానికి మరొకరు దొరికేంతవరకు నీకీ బాధ తప్పదు,'' అన్నాడు.

''అవును, వివాహమైన కొత్తలో మనసులోని మాట చెప్పుకోవడానికి, మంజరిని మీరే ఎంపిక చేశారు. అలాంటివారు మరొకరు దొరకరు,'' అని బాధపడింది మహారాణి.

''ప్రయత్నిస్తే దొరక్క పోరు. నీ మనసులో ఎవరైనా ఉంటే చెప్పు,'' అన్నాడు మహారాజు.

''మంజరికి ఒక కూతురున్నది. దాన్ని దాసిగా పెట్టుకుంటే మంజరికి మేలు చేసిన దాన్నవుతాను,'' అన్నది మహారాణి.

రాజు మంజరి కూతురు చంద్రిక గురించి ఆరాతీయించాడు. చంద్రిక మనిషి మంచిదే కాని, దాని నోట్లో ఏ చిన్న విషయమూ దాగదు. తనకు తెలిసిన విషయం పదిమందికీ పోగేసి చెప్పందే దానికి నిద్రపట్టదు.

ఆ విషయం తెలుసుకున్న మహారాజు, మహారాణికి చెప్పేలోగా ఆమె చంద్రికను పిలిపించి, ''నిన్ను మీ అమ్మస్థానంలో దాసిగా నియమిస్తున్నాను,'' అని చెప్పి తన దగ్గర ఉండేలా ఏర్పాటు చేసుకున్నది.

చంద్రిక నోట్లో ఏ విషయమూ దాగదన్న నిజం రాణికి చెప్పి, ఆమె మనసు నొప్పించడం ఇష్టంలేని మహారాజు, చంద్రిక చర్యల మీద నిఘా వేయడానికి, ఒక గూఢచారిని ఏర్పాటు చేశాడు.

ఒకనాటి రాత్రి మహారాజు, మహారాణితో మాటల సందర్భంలో, ''నీ ఆంతరంగిక చెలికత్తె చంద్రికతో ఇవాళ ఏం రహస్యాలు చెప్పావేమిటి?'' అని అడిగాడు.

''జయపురి రాజు మన మీద దాడికి సన్నద్ధమవుతున్న విషయం చెప్పాను. నాకు తెలిసిన రహస్యం ఎవరో ఒకరికి చెప్పకుండా నేను ఉండలేనని తమకు తెలియనిది కాదు కదా,'' అన్నది మహారాణి.

చంద్రిక నోరు జారితే యుద్ధం విషయం పదిమందికీ తెలిసి, ప్రజలు ముందే భయభ్రాంతులవుతారేమోనని రాజు కలవరపడ్డాడు. అయినా మహారాణి వద్ద తన కలవరపాటును కనబరచలేదు. మరునాటి ఉదయం మహారాజు, చంద్రిక విషయమై వాకబు చేయడానికి గూఢచారిని పిలిపించి, చంద్రిక ఎవరెవరిని కలిసిందో ఆరాతీశాడు.

‘‘మహారాజా, చంద్రిక ఇంట్లోని వాళ్ళందరూ పెళ్ళికని లక్ష్మీపురం వెళ్ళారు. చంద్రిక రాత్రంతా నిద్రపట్టక సతమతమవుతూ గడిపింది. ఉదయాన్నే మొదట తన తల్లి సమాధి వద్దకూ, ఆ తరవాత అన్నపూర్ణాదేవి ఆలయానికీ వెళ్ళి చాలాసేపు ధ్యానంలో గడిపింది,’’ అని చెప్పి వెళ్ళాడు గూఢచారి.

కొంతసేపయ్యాక అంతఃపురానికి వచ్చిన చంద్రిక మహారాణితో, ‘‘దేవాలయానికి వెళ్ళి వచ్చాను. ప్రసాదం స్వీకరించండి,’’ అని ప్రసాదం అందించింది.

అప్పుడే అక్కడికివస్తూ దానిని చూసిన మహారాజు, ‘‘దేవిని ఏం కోరుకున్నావు, చంద్రికా?’’ అని అడిగాడు.

చంద్రికమహారాజుకు వినయంగా నమస్కరించి, ‘‘మహారాజా నానోట్లో ఏ విషయమూ దాగదు. అది నా బలహీనత. ఇంతకు ముందు నేను ఏ విషయం ఎవరికి చెప్పినా ప్రమాదం లేదు. ఇప్పుడు నేను అంతఃపురదాసిని. అంతఃపుర రహస్యం బయటకు పొక్కితే ఎంత ప్రమాదమో, చనిపోయిన మా అమ్మ నాతో తరచూ చెప్పేది. ఒకవేళ ఆమె తరవాత నేను మహారాణి వద్ద దాసీగా చేరితే, ఎంత జాగ్రత్తగా మసలుకోవాలో నేర్పేది. అందుకే రానున్న యుద్ధం గురించి, మహారాణిగారు నా చెవిన వేసిన విషయం, బయటివారికి చెప్పుకోలేక మౌనంగా మా అమ్మ సమాధికీ, గుడిలోని దేవతకూ చెప్పుకున్నాను. అంతేకాదు. యుద్ధం రాకుండా చూడమని ప్రార్థించాను,’’ అని చెప్పింది.

ఆ మాటలు విని మహారాజు చంద్రికను సంతోషంతో అభినందించి, తన చేతి వ్రేలి కున్న ఉంగరాన్ని బహుమతిగా ఇచ్చి, మహారాణికేసి తిరిగి, ‘‘దేవీ, నీ మనసులోని మాట చెప్పుకోవడానికి మంచి చెలికత్తె దొరికింది. మరేం భయం లేదు,’’ అన్నాడు.

ఆ తరవాత, ‘‘మహారాజావారు నీకెందుకు ఉంగరం బహుమతిగా ఇచ్చారు?’’ అని ఎందరడిగినా చంద్రిక, ‘‘అది అంతఃపుర రహస్యం,’’ అని చెప్పి తప్పుకునేదేగాని, అసలు విషయం మాత్రం ఎప్పుడూ బయట పెట్టలేదు.



## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (18)

# ఒక తల్లి దృక్పథం

రష్యాను జార్‌లనే రాజులు పరిపాలించారు. 1917లో జరిగిన విప్లవంతో రాచరిక వ్యవస్థ అంతమై, ఆ తరవాత ఏర్పడిన నూతన ప్రభుత్వానికి లెనిన్ నాయకుడయ్యాడు. రష్యా మరో పద్నాలుగు రిపబ్లిక్‌లతో కలిసి ప్రపంచంలోనే అతి పెద్ద దేశం సోవియట్ రష్యా ఆవిర్భవించింది.

సోవియట్ రష్యాను పాలించిన కమ్యూనిస్టు పార్టీ మొదటి మహానాయకుడు లెనిన్. 1924లో లెనిన్ మరణించడానికి రెండేళ్ళ ముందు జోసెఫ్ స్టాలిన్ (1879-1953) కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి అయ్యాడు. కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా ఉన్నవారే, ప్రధానికి గల సర్వ అధికారాలతో దేశపాలకుడు కావాలన్నది అక్కడి రాజ్యాంగ శాసనం. నిజానికి లెనిన్ మరణానంతరం స్టాలిన్ ఆ దేశ నియంత అయ్యాడు. ఏ జార్ చక్రవర్తీ చెలాయించని అధికారాలు ఆయనకు ఉండేవి.

అయితే, మనం ఇప్పుడు ముచ్చటించనున్న చిన్న ఉదంతం స్టాలిన్ జీవితం తొలిదశలో జరిగినది. ఆయన జార్జియా రాష్ట్రంలోని పేద చర్మకారుల కుటుంబంలో జన్మించాడు. అయినప్పటికీ తల్లిదండ్రులు అతన్ని కష్టపడి టిఫ్లిస్‌లోని పాఠశాలలో చేర్పించారు. ఆ పాఠశాల పిల్లలకు క్రైస్తవ మతాన్ని బోధించి వారిని మత ప్రచారకులుగా తయారుచేసేది.

స్టాలిన్ విద్యార్థిగా ఎలా చదివేవాడో తెలియదుగాని, జార్‌ల పాలనకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టి పోరాడుతూన్న విప్లవకారులలో చేరిపోవడం వల్ల, ఆయన విద్యాభ్యాసం అర్ధంతరంగా ఆగిపోయింది. ఆయన 1913వసం.లో అజ్ఞాతంలోకి వెళ్ళి 1917 తిరిగి వచ్చి విప్లవకారులలో మితవాదులకూ, తీవ్రవాదులకూ మధ్య జరిగిన అంతర్యుద్ధంలో పాల్గొన్నాడు. అలజడితో నిండిన ఆ సమయంలో పాత ఇంటినీ, కుటుంబాన్నీ

### చందమామ ఇండియా క్విజ్-3 (ఏప్రిల్ 2007) సమాధానాలు

1. బాలగంగాధర తిలక్, లాలా లజపత్ రాయ్, బిపిన్ చంద్ర పాల్. (బాల్-లాల్-పాల్)
2. భారత జాతీయ కాంగ్రెస్; అలన్ ఆక్టేవియన్ హ్యూమ్. విశ్రాంత ఐసిఎస్ అధికారి.
3. ''స్వాతంత్ర్యం నా జన్మహక్కు, దానిని సాధించి తీరుతాను.''
4. లాహోర్. జవహర్ లాల్ నెహ్రూ. 1930 జనవరి 26న సంపూర్ణ స్వాతంత్ర్యదినం జరపడం.
5. సరోజినీ నాయుడు. 1925లో కాన్పూర్‌లో జరిగిన మహాసభకు.

గురించి ఆలోచించే వెసులుబాటు ఆయనకు లేకపోయింది.

పార్టీలో తిరుగులేని నాయకుడుగా, సోవియట్ యూనియన్ పాలకుడుగా అధికారంలో స్థిరపడ్డాక స్టాలిన్ తల్లిని చూడాలనుకుని స్వస్థలానికి వెళ్ళాడు. వృద్ధురాలైన ఆ తల్లి తనయుణ్ణి నఖశిఖ పర్యంతం తేరిపార చూసి, అతన్ని గురించి ప్రజలు రకరకాలుగా చెప్పుకునే విషయాలను ప్రస్తావించి, అవేవీ తనకు ఓ పట్టాన అంతు బట్టడం లేదని చెప్పింది. ఆఖరికి, ''ఇంతకూ, అసలు నువ్వేం చేస్తున్నావో చెప్పు నాయనా. నువ్వు నిజంగానే ఏదైనా ఉద్యోగం, పదవి వహిస్తున్నావా? ఉంటే, అది ఎంత ఉపయోగకరం?'' అని అడిగింది.



''అమ్మా, నేను సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిని,'' అన్నాడు స్టాలిన్.

''అందరిలాగే నువ్వూ నన్ను తికమక పెడుతున్నావు. అయినా నీకు నువ్వుగా చూసుకున్న ఆ పదవి, పరిస్థితులు ఎలా ఉన్నాయో ఏమో నాకు తెలియదు. ఫరవాలేదు. నీ ఉద్యోగంలో నువ్వు సంతోషంగా ఉన్నట్టున్నావు. నాకు అది చాలు,'' అంటూ నిట్టూర్చింది.

తల్లీ కొడుకులు ఒకరినొకరు చూస్తూ నవ్వుకున్నారు. దేశాధినేత తరవాతి ఇతర ముఖ్యమైన పనులు చూడడానికి అక్కడి నుంచి బయలుదేరవలసి వచ్చింది.

''అమ్మా, నేను ఇక బయలుదేరుతాను,'' అంటూ స్టాలిన్ లేచి నిలబడ్డాడు.

ఆ తల్లి మళ్ళీ ఒకసారి కొడుకును ఆప్యాయంగా తేరిపార చూస్తూ నిట్టూర్చి, ఇలా అన్నది: ''మంచిది, వెళ్ళిరా నాయనా. మరీ కష్టపడి పనిచేస్తూ నీ ఆరోగ్యం పాడుచేసుకో వద్దు. జాగ్రత్తగా చూసుకో. నిన్ను గురించి ఎవరు ఏమన్నా అనుకోనీ, నువ్వు చిన్నప్పుడు నా మాటవిని బుద్ధిగా చదువుకుని ఉంటే ఈపాటికి మంచి బోధకుడివి అయ్యుండేవాడివి. ఇక్కడున్న ఈ చర్చిలో బిషప్ స్థానానికి ఎదిగివున్నా ఆశ్చర్యపడడానికి లేదు. అవును నాయనా నిజం. నువ్వు ఉన్నతమైన బిషప్ స్థానానికి వచ్చి ఉండేవాడివి. నీకు అంత సామర్థ్యం ఉండేది. అయితే...''

స్టాలిన్ తల్లి వద్ద సెలవు పుచ్చుకుని బయలుదేరాడు. –(ఎం.డి)



# గురువు – శిష్యుడు – మిత్రుడు

భూమేశం గురుకులంలో విద్యాభ్యాసం పూర్తి చేసి సొంత ఊరికి తిరిగి వచ్చాడు. వివిధ శాస్త్రాలలో అతడికున్న పాండిత్యాన్ని గమనించిన అతడి తండ్రి పరమేశం ఎంతో సంతోషించాడు. వ్యవసాయంలో తనకు తెలిసిన కిటుకులు చెప్పి, తనకున్న పదెకరాల పొలాన్ని కొడుక్కు అప్పగించాడు.

భూమేశం ఆ కిటుకులకు తన తెలివి తేటలు జోడించి కొత్త పంటలు వేశాడు. కొత్త ప్రయోగాలు చేశాడు. మొదటి సంవత్సరం అతనికి కొద్దిపాటి లాభమే వచ్చింది. ఆ తరవాతి సంవత్సరం మంచి లాభాలు వచ్చాయి. అప్పటి నుంచి అతడికి లాభాలే లాభాలు. దానిని చూసి తండ్రి పరమానందం చెందాడు. ఊరివాళ్ళు భూమేశం ప్రతిభను ఎంతో మెచ్చుకుని అతన్ని సలహాలడిగి బాగుపడ్డారు.

భూమేశం వ్యవసాయరంగంలో సాధించిన ఘనవిజయాల గురించి గ్రామాధికారి ఆ దేశపు రాజుకు తెలియజేశాడు. రాజు భూమేశాన్ని తన కొలువుకు రప్పించి ఘనంగా సత్కరించి పంపాడు. తమ ఊరికి పేరు తెచ్చిన భూమేశం గురించి అందరికీ తెలియాలని, ఆ ఊరివాళ్ళు పెద్ద వేడుక ఏర్పాటు చేసి, దానికి చుట్టుపక్కల ఊరి పెద్దలందరినీ ఆహ్వానించారు. అలా పిలుపును అందుకున్న వారిలో కామేశం, రామేశం కూడా ఉన్నారు.

ఆ యేడాది కామేశం పొలంలో ఊరి వారందరికన్నా ఎక్కువ పంట దిగుబడి వచ్చింది. దాంతో వ్యవసాయంలో తనను మించినవాడు లేడని గొప్పలు చెప్పుకోసాగాడాయన. భూమేశానికి జరిగిన రాజసన్మానం మింగుడు పడక, పొరుగూరు వేడుకలకు వెళ్ళినప్పుడాయన భూమేశాన్ని కలుసుకుని, ''వ్యవసాయంలో ఎన్నో ఏళ్ళ అనుభవం ఉన్నవాణ్ణి. కిటుకులు చెప్పమని ఎక్కడెక్కడి రైతులూ నా దగ్గరికి వస్తూ ఉంటారు. నీకు అనుభవం లేదు. నా

సలహా తీసుకోలేదు. నీకింత పేరు రావడం ఆశ్చర్యంగా ఉంది,'' అన్నాడు.

భూమేశం వినయంగా, ''అనుభవంలేక మొదట్లో ఆశించినంత పంట పండించలేక పోయాను. అప్పుడే తమబోటి అనుభవజ్ఞుల దర్శన భాగ్యం కలిగివుంటే అలా జరిగేది కాదు. ఇప్పుడు కూడా మించి పోయిందిలేదు. మీ అనుభవాలు చెప్పి పుణ్యం కట్టుకోండి. మీ పేరు కలకాలం చెప్పుకుంటాను,'' అన్నాడు.

కామేశం ఉబ్బిపోయి, భూమేశానికి బోలెడు వ్యవసాయపు కిటుకులు చెప్పాడు. శ్రద్ధగా విన్న భూమేశం, ''అయ్యా, వ్యవసాయంలో మీకు మీరే సాటి. మీరు నాకు గురుతుల్యులు. మిమ్మల్ని కలవడం నా అదృష్టం,'' అంటూ ఆయనకు పాదాభివందనం చేశాడు.

కామేశం మరింత పొంగిపోతూ పక్కనే వున్న రామేశం వంక గర్వంగా చూశాడు. రామేశం చిన్నగా నవ్వుతూ భూమేశంతో, ''నీకు అభ్యంతరం లేదంటే మనం మంచి మిత్రులుగా ఉందాం,'' అన్నాడు.

భూమేశం అందుకు అంగీకరించడంతో, ఆ ఊరిపెద్దలు మరికొందరు అతని స్నేహం కోరారు.

మరుసటి యేడు వారందరూ కూడా కామేశం కంటే ఎక్కువ పంట పండించారు. దాన్ని చూసి కామేశం ఉక్రోషపడగలడని అందరూ అనుకున్నారు. కానీ అతడు, ''నా శిష్యుడైన భూమేశం సలహాలు పాటించి మీరు ఈ యేడాది ఎక్కువ పంట పండించారు. అది నాకు గర్వకారణమే కదా?'' అన్నాడు ఎంతో గొప్పగా.



అందుకు కొందరు, ''భూమేశం నిన్ను గౌరవిస్తే అది అతడి వినయం. అంతే తప్ప, అతడు నీ శిష్యుడంటే ఒప్పుకోలేం,'' అన్నారు.

అయితే, రామేశం వారితో ఏకీభవించ కుండా, ''మనతో స్నేహానికి ఒప్పుకున్న భూమే శమే మన కామేశాన్ని గురువుగా స్వీకరించాడు. కాబట్టి భూమేశం కామేశం శిష్యుడే. అంతేకాదు, ఈ రోజు నుంచి కామేశం నాక్కూడా మిత్రుడు కాదు; గురువే,'' అన్నాడు.

ఈ మాటలకు ఊరిపెద్దలు తెల్లబోయారు. కామేశం, ''చూశారా, మన రామేశానికి రాజ సన్మానం మీద ఆశపుట్టింది. కానీ అందుకు కేవలం నా శిష్యుడైతే మాత్రం చాలదు. భూమేశానికున్న తెలివితేటలు కూడా కావాలి,'' అన్నాడు ఊరిపెద్దలతో.

అప్పుడు రామేశం గంభీరంగా, ''గురువు నేర్పేవాడే కానీ, నేర్చుకునేవాడు కాదు. శిష్యుడు నేర్చుకునేవాడేగాని నేర్పేవాడు కాదు. మిత్రుడైతే నేర్పడు, నేర్చుకోడు. అతడు తెలివిని పంచుకుంటాడు. కాబట్టి మన కంటే తెలివి తక్కువవాణ్ణి మిత్రుడిగా కంటే గురువుగా భావించడమే లాభం. అప్పుడు అతడికి తెలిసిన కాస్త మనం నేర్చుకుని బాగుపడవచ్చు. మనకు తెలిసిందేమీ అతడికి నేర్పనక్కరలేదు. భూమేశం తెలివైన వాడని గ్రహించి మనమతణ్ణి మిత్రుడిగా భావించాం. ఎన్నో కొత్త విషయాలు తెలుసుకుని బాగుపడ్డాం. కామేశం తెలివి ఏపాటిదో భూమేశంఎప్పుడో అంచనా వేశాడు. అందుకే అతణ్ణి గురువుగా స్వీకరించి తను బాగుపడ్డాడు. తనవల్ల కామేశం బాగుపడే అవకాశం లేకుండా చేశాడు. నేనూ భూమేశం పద్ధతిలోనే కామేశాన్ని గురువుగా భావిస్తున్నాను,'' అన్నాడు.

నేర్చుకోవలసిన చోట నేర్చుకునేందుకు బదులు ప్రగల్భాలు పలికినందుకే కామేశాన్ని రామేశం గురువని ఎకసక్కెం చేశాడని గ్రహించిన ఊరిపెద్దలు ఫక్కున నవ్వారు.

కామేశం రామేశం చేతిలో మరోసారి భంగపడ్డాడు.





# కృతఘ్నుడైన రాజు

కాశీరాజ్యాన్ని పాలించే బ్రహ్మదత్తుడికి ఒక కుమారుడుండేవాడు. అతడు చిన్నతనం నుంచీ బహుక్రూరస్వభావుడు. ఏ కారణమూ లేకుండానే దారేపోయే వాళ్ళను భటులచేత పట్టించి, నానా హింసలపాలుచేసి ఆనందించే వాడు. వృద్ధులపట్లా, పండితులపట్లా చిన్న మెత్తు గౌరవభావం లేకపోగా, అనవసరంగా వాళ్ళను అవమానిస్తూండేవాడు. ఈ కారణాల వల్ల, యువరాజన్న గౌరవభావం అతడి పైన ఎవరికీ వుండేది కాదు. అందరూ అతణ్ణి అసహ్యించుకునేవారు.

అతడు ఇరవై ఏళ్ళ వయసువాడై వుండగా, కొందరు స్నేహితులతో కలిసి నదికి స్నానానికి వెళ్ళాడు. అతడికి ఈతరాదు. అందువల్ల గజ ఈతగాళ్ళయిన కొందరు నౌకర్లను వెంట తీసుకుపోయాడు.

యువరాజూ, అతడి స్నేహితులూ నదిలో స్నానం చేస్తూండగా, హఠాత్తుగా ఆకాశాన్ని మేఘాలు కప్పి వేసినై. భయంకరమైన ఉరుములూ, మెరుపులతో జడివాన ప్రారంభమయింది. అది చూసి యువరాజు పట్టలేని ఆనందంతో చప్పట్లు చరిచి నౌకర్లతో, ''ఇలాంటి సమయంలో నది మధ్య స్నానం చేయడం చాలా బావుంటుంది. నన్ను అక్కడికి తీసుకుపొండి,'' అన్నాడు.

నౌకర్లు ఈ ఆజ్ఞ వింటూనే నదిలోకి దిగి, యువరాజును నది మధ్యకు తీసుకుపోయారు. అతడి స్నేహితులు మాత్రం జాగ్రత్త కొద్దీ గట్టు దగ్గిర అంతగా లోతులేని నీళ్ళలో వుండిపోయారు. ఉన్నకొందికీ వాన అధికం కాసాగింది. దానికితోడు కొద్దిగజాల దూరంలో ఏమున్నదీ కానరాకుండా, అంతటా చీకటి అలముకున్నది.

నౌకర్లకు పరమ దుష్టుడైన యువరాజు మీద పగతీర్చుకునేందుకు, ఇది మంచి సమయంగా తోచింది. వాళ్ళు అతణ్ణి నది మధ్య అలాగే వదిలి, వేగంగా ఒడ్డుకు ఈదుకు వచ్చేశారు.



“యువరాజేమయ్యాడు?” అని అతడి స్నేహితులు నౌకర్లను అడిగారు.

“ఆయన, మా చేతుల పట్టు వదిలించుకుని, ఈదుతూ వెళ్ళాడు. బహుశా, వెంటనే రాజభవనానికి వెళ్ళాలన్న కోర్కె కలిగి వుంటుంది,” అని జవాబు చెప్పారు నౌకర్లు.

అందరూ తిరిగి వచ్చాక, రాజు తన కొడుకును గురించి నౌకర్లను అడిగాడు. వాళ్ళు, అతడి స్నేహితులకు ఇచ్చిన జవాబే ఇచ్చారు. వెంటనే రాజు సైనికులను పిలిచి, నదీ ప్రాంతాలన్నీ యువరాజు కోసం వెతకమన్నాడు. వాళ్ళు నడిరేయి వరకూ అంతా గాలించి, యువరాజు జాడలేదని రాజుకు చెప్పారు.

అయితే, యువరాజు మరణించలేదు. ప్రవాహ వేగానికి అతడు మునుగుతూ, తేలుతూ కొట్టుకుపోతూండగా, అదృష్టవశాత్తూ అతడికి నీటివాలున పడి తేలుతూ వస్తున్న ఒక చెట్టు కొమ్మ దొరికింది. దాని ఆధారంతో అతడు ప్రాణరక్షణ చేసుకున్నాడు. అయితే, ఆ కొమ్మ మీద అప్పటికే మూడు ప్రాణులున్నవి; అవి ఒక పామూ, ఎలుకా, చిలుకా.

యువరాజు అంత తుఫాను హోరులోనూ మధ్య, మధ్య పెద్దగా గొంతెత్తి, “రక్షించండి! రక్షించండి!” అని కేకలు పెట్టసాగాడు.

ఈ విధంగా, కొమ్మతోపాటు యువరాజు నదీ జలంలో కొట్టుకుపోతూండగా సూర్యాస్తమయకాలం అయింది. ఆ సమయంలో నది ఒక అరణ్యంగుండా ప్రవహిస్తున్నది. సాధువుగా జన్మించి, నది ఒడ్డున ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్న బోధిసత్త్వుడు, యువరాజు కేకలు విన్నాడు.

ఆయన దృఢకాయుడు; ధైర్యశాలి. వెంటనే అంత తుఫాను మధ్య బోధిసత్త్వుడు నదిలో దిగి, ఈదుకుంటూ పోయి, కొమ్మను తీరానికి లాక్కువచ్చాడు. తరవాత యువరాజుతోపాటు వున్న మూడు ప్రాణుల్నీ తన కుటీరానికి తీసుకుపోయి, చలిమంట వేసి, భోజనం తయారుచేశాడు. ఆయన ముందుగా అల్పజీవులైన పామూ, ఎలుకా, చిలుకలకు ఆహారం పెట్టి, యువరాజు భోజనం ముగించాక పక్క ఏర్పాటుచేశాడు.

ఈ విధంగా వాళ్ళు రెండు రోజులు బోధిసత్త్వుడికి అతిథులుగా వున్నారు. ఈ లోపల తుఫాను తగ్గిపోయింది. యువరాజుతోపాటు, మూడు ప్రాణులూ తిరిగి స్వస్థత చెందాయి.



చిలుక అక్కడినుంచి తన నివాసానికి బయలుదేరుతూ బోధిసత్వుడితో, ''అయ్యా, తమరు నా ప్రాణదాతలు. నది పక్కన వున్న ఒక చెట్టుతొర్ర, నా నివాసస్థానం. తుఫాను తాకిడికి అది నదిలో పడిపోయింది. నేను ఎగరలేకపోయాను. నాకు హిమాలయాల్లో చాలా మంది మిత్రులున్నారు. మీకు ఏనాడైనా అవసరం కలిగితే, నదికి ఆవలనున్న పర్వతపాదం దగ్గిర నిలబడి, నన్ను పిలవండి. నా మిత్రులచేత మీకు అపూర్వమైన ధాన్యాలూ, ఫలాలూ తెప్పించి ఇవ్వగలను,'' అన్నది.

''నీ వాగ్దానం గుర్తుంచుకుంటాను!'' అన్నాడు బోధిసత్వుడు.

పాము, బోధిసత్వుడితో, ''నేను పూర్వ జన్మలో ఒక వర్తకుణ్ణి. కొన్ని కోట్ల బంగారు నాణేలను నది గట్టున ఒక చోట గుప్తపరిచాను. ఆ బంగారం మీది వ్యామోహం వల్ల, ఈ జన్మలో ఇలా పామునై పుట్టాను. నా జీవితం ఆ నిధిని కాపాడడంతో గడిచిపోతున్నది. ఆ బంగారాన్ని తమరు ఏదైనా నలుగురికీ ప్రయోజనకరంగా ఉపయోగించగలిగితే, దాన్ని తమపరం చేస్తాను,'' అన్నది.

ఆ తరవాత ఎలుక కూడా తనను గురించి చెప్పుకున్నది. బోధిసత్వుడు ఆ మూడింటినీ భవిష్యత్తులో తిరిగీ కలుసుకుంటానన్నాడు.

యువరాజు బోధిసత్వుడితో, ''ఏదో ఒక నాడు నా తండ్రి తరవాత నేను కాశీరాజ్యానికి రాజునవుతాను. అప్పుడు మీరు నగరానికి రండి. తమను సకల మర్యాదలతో ఆహ్వానించగలను,'' అన్నాడు.

కొన్ని సంవత్సరాల తరవాత బోధిసత్వుడు కాశీకి వెళ్ళాడు. అప్పటికి బ్రహ్మదత్తుడు చనిపోయి యువరాజు సింహాసనానికి వచ్చాడు.

బోధిసత్వుడు నగరం చేరి, రాజవీధిన నడుస్తూండగా, ఏనుగు అంబారీలో షికారు పోతున్న అతడు, బోధిసత్వుణ్ణి చూస్తూనే, తన అంగరక్షకులతో, ''ఆ సాధువును వెంటనే పట్టుకుని స్తంభానికి కట్టి, కొరడాలతో గట్టిగా కొట్టండి. ఆపైన వధ్యస్థానానికి తీసుకుపోయి, తల నరకండి. వీడికి ఎంత పొగరంటే-అప్పట్లో యువరాజైన నన్ను కాదని, నా కంటె ఎక్కువగా ఒక పాముకూ, ఎలుకకూ, చిలుకకూ సేవలు చేశాడు,'' అన్నాడు.

ఇలా రాజాజ్ఞ కాగానే అంగరక్షకులు బోధిసత్వుణ్ణి పట్టుకుని కొరడాలతో కొట్టసాగారు. అది చూసిన ప్రజలు బోధిసత్వుణ్ణి, ''అయ్యా,

తమరేనాడైనా, ఈ రాజుకు ఉపకారం చేశారా?'' అని అడిగారు.

''అవును, చేశాను!'' అని బోధిసత్వుడు జరిగినదంతా చెప్పాడు.

కాశీరాజ్య ప్రజలు ఈ కొత్త రాజుపాలనలో నానా హింసలకూ, అవమానాలకూ గురవుతున్నారు. ఇంతకాలంగా రాజుపట్ల వాళ్ళకున్న మితిమీరిన ద్వేషం, బోధిసత్వుణ్ణి అతడి అంగరక్షకులు హింసించడం చూసేసరికి భగ్గుమన్నది. వాళ్ళు చేతికందిన ఆయుధాలు తీసుకుని అంగరక్షకులపైబడి, వాళ్ళను తరిమివేసి, బోధిసత్వుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశారు.

దుష్టుడైన రాజు ప్రజల ఆగ్రహం చూసి, అక్కడి నుంచి పారిపోవాలని ప్రయత్నించాడు. కాని, ప్రజలు అతణ్ణి తరిమి ఏనుగుపై నుంచి కిందికి పడదోసి చంపివేశారు.

ప్రజల కోరికపై బోధిసత్వుడు, వాళ్ళకు రాజై ధర్మం తప్పకుండా రాజ్యపాలన చేశాడు. ఆయన పామునూ, ఎలుకనూ, చిలుకనూ మరిచిపోలేదు. ఒకసారి అరణ్యానికి పోయి అక్కడ పామునూ, ఎలుకనూ కలుసుకున్నాడు. అవి తమ నిధి నిక్షేపాలను స్వీకరించవలసిందిగా ఆయన్ను కోరినై.

బోధిసత్వుడు ఆ కోర్కెను కాదనలేక ధనంతోపాటు వాటిని కూడా నగరానికి తీసుకు వచ్చాడు. చిలుకను కూడా కలుసుకుని, దాన్ని కూడా తన వెంట రావలసిందిగా ఆహ్వానించాడు.

ఆయన ప్రజల క్షేమం కోసం నిధిని ఖర్చుపెట్టటమే గాక, పాము నివసించేందుకు రాజప్రాసాదం పైన ఒకచోట బంగారంతో చిన్న సొరంగం ఏర్పాటు చేశాడు. దానితోపాటు ఎలుక వుండేందుకు మణిమాణిక్యాలు తాపడం చేసిన ఒక పెద్ద కలుగూ, చిలుకకు అందమైన ఒక బంగారు పంజరం తయారు చేయించాడు.

ఈ విధంగా కృతఘ్నుడూ, దుష్టుడూ అయిన రాజు పోయి, కాశీరాజ్య ప్రజలకు ధర్మస్వరూపుడైన బోధిసత్వుడు రాజుగా దొరకడంతో, వాళ్ళు ఎంతోకాలం, సుఖంగా జీవించారు.





# రామాయణం

పంచవటిలో ఆశ్రమం కల్పించుకుని తమ పర్ణశాలలో సీతారామలక్ష్మణులు సుఖంగా ఉంటున్నారు. హేమంత ఋతువు వచ్చింది. ఒకనాటి తెల్లవారుఝామున వారు ముగ్గురూ స్నానం చెయ్యటానికి గోదావరి వద్దకు పోతూ ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పుకోవటంలో లక్ష్మణుడు భరతుణ్ణి మెచ్చుకుని, అటువంటి వాడికి తల్లి అయికూడా దుర్మార్గురాలయినందుకు కైకేయిని నిందించాడు. రాముడు అడ్డం వచ్చి, ''కైకేయిని తిట్టటం మానేసి భరతుణ్ణి గురించే మాట్లాడు,'' అన్నాడు. తాను భరతలక్ష్మణశత్రుఘ్నులతోనూ సీతతోనూ కలిసి ఎప్పుడు రాజ్యం చేస్తానో గదా అని రాముడు విచారించాడు.

వారు ముగ్గురూ గోదావరిలో స్నానాలు చేసి, ఆశ్రమానికి తిరిగి వచ్చి, ఉదయం చేయవలసిన కర్మకాండ అంతా ముగించుకుని పర్ణశాలలో కూచుని ఉండగా అటుగా ఒక రాక్షస స్త్రీ వచ్చింది. ఆమె రావణుడి చెల్లెలైన శూర్పణఖ. దాని ముఖం వికారం. దాని కొక పెద్ద పొట్టా, ఎర్రని జుట్టూ, భయంకరమైన గొంతూ ఉన్నాయి. వయసు మళ్ళినది. ఆ అనాకారి రాముణ్ణి చూస్తూనే మోహించింది. ఆమె రాముణ్ణి పలకరిస్తూ, ''వేషం చూడబోతే మునివి. వెంట ఆయుధాలున్నాయి, భార్య ఉన్నది. నువ్వు మా రాక్షసుల దేశానికెలా వచ్చావు?'' అన్నది.

రాముడు మంచిగా ఆమెకు తనవృత్తాంతం సీత సంగతి చెప్పి, ''ఇంతకూ నువ్వెవరు? ఎవరి కుమార్తెవు?'' అని అడిగాడు.

''నా పేరు శూర్పణఖ. కామరూపినిని. ఒంటరిగా అరణ్యమంతా తిరుగుతూంటాను.



నువ్వు రావణుడి పేరు వినే ఉంటావు. గొప్ప బలపరాక్రమాలు గలవాడు; విశ్వవసుడి కుమారుడు; రాక్షసరాజు. అతడు నా అన్న. ఎప్పుడూ నిద్రపోయే కుంభకర్ణుడు కూడా నా సోదరుడే. విభీషణుడు నా సోదరుడే గాని, అతడికి రాక్షస లక్షణాలు లేవు. పరాక్రమ వంతులు ఖర దూషణులు నా సోదరులు. నిన్ను చూస్తుంటే ఈ నావారందరినీ వదిలేసి నీకు భార్యగా ఉండిపోవాలనిపిస్తున్నది. ఈ సీతను విడిచి పెట్టి నన్ను కట్టుకో. ఈమె వికారంగా ఉంది; కురూపి; నీకు తగదు. మనిద్దరికీ ఈడూ జోడుగా ఉంటుంది. మనం హాయిగా ఈ దండకారణ్యమంతా విహరించుదాం,'' అన్నది శూర్పణఖ.

రాముడు శూర్పణఖతో, ''నాకొక భార్య ఉండనే ఉన్నది. నా భార్య అంటే నాకు చాలా ఇష్టంకూడానూ. నువ్వు చూడబోతే గొప్ప వంశానికి చెందినదానివి. నీకు సవతి ఉండటం ఉచితం కాదు. ఇతను చూడు, నా తమ్ముడు. అందగాడు, పరాక్రమవంతుడు; భార్యను వెంటపెట్టుకు రాకుండా వచ్చి, బ్రహ్మచారిగా ఉంటున్నాడు. ఇతన్ని కట్టుకున్నావంటే నీకు సవతిపోరు తప్పుతుంది,'' అన్నాడు.

శూర్పణఖ వెంటనే రాముణ్ణి వదిలి లక్ష్మణుడి వద్దకు వెళ్ళి, తనను భార్యగా చేసుకోమన్నది.

లక్ష్మణుడు నవ్వుతూ, ''అయ్యో, ఎంతో సుకుమారివి. నేనే సేవకుడిలాగా జీవిస్తున్నాను. నన్ను పెళ్ళాడితే నువ్వు కూడా దాసీదానివై పోతావు. నా యజమాని రాముడు. అతనికే రెండవ భార్యవుగా ఉండటం మంచిది. నీ వంటి సుందరాంగిని పెళ్ళాడినాక రాముడు తన మొదటి భార్యను వదిలేస్తాడు. ఎందుకంటే, ఆమె వికారంగా ఉంటుంది, అంతేకాక ముసలిది,'' అన్నాడు.

రామలక్ష్మణులు తనను వేళాకోళం పట్టిస్తున్నారని శూర్పణఖ గ్రహించలేక పోయింది. ఆమె రాముడి దగ్గిరికి పోయి, ''ఈ ముసలి కురూపిని కట్టుకుని నా అందాన్ని కాలదన్నుతున్నావు. దీన్నిప్పుడే తినేస్తాను. ఆ తరవాత సవతి బెడద లేకుండా మనిద్దరమూ సుఖంగా ఉండవచ్చు,'' అని చెప్పి సీత మీదికి వెళ్ళింది. సీత భయపడి పరిగెత్తితే శూర్పణఖ ఆమె వెంటపడింది.

రాముడు లక్ష్మణుడితో, ''దుష్టులతో పరిహాసం ఎంత చెడ్డదో చూశావా? సీతకు

అపాయం రాకుండా చూడు. ఈ శూర్పణఖను అంగహీనగా చెయ్యి,'' అన్నాడు.

లక్ష్మణుడు వెంటనే రాముడి పక్కనే ఉన్న కత్తి తీసుకుని శూర్పణఖ ముక్కూ, చెవులూ కోసేశాడు.

శూర్పణఖ బాధతో పెద్దపెట్టున అరిచి, తాను వచ్చిన దారినే మహారణ్యంలోపడి పారిపోయింది.

జనస్థానంలో ఖరుడు అనేకమంది ఇతర రాక్షసులతో సహా కూచుని ఉన్న చోటికి, రక్తం కారుతూ శూర్పణఖ వచ్చి చేరి నేల మీద పడిపోయింది. నెత్తురు వరదలు కారుతూ వికార రూపంలో తన చెంత వచ్చి పడిన శూర్పణఖను చూసి ఖరుడు, ''నన్ను చూసి మూడు లోకాలవారూ భయపడతారు గదా, నిన్నీవిధంగా చేసి తన ప్రాణాల మీదికి తెచ్చుకున్న వాడెవడు?'' అని అడిగాడు.

శూర్పణఖ అతనితో సీతా రామ లక్ష్మణులను గురించీ, వారు తనకు చేసిన పరాభవం గురించీ చెప్పి, ''నువ్వు వారి ముగ్గురినీ చంపి వారి రక్తం తెప్పిస్తే తాగేస్తాను. ఇదే నా కోరిక,'' అన్నది.

ఖరుడు తన అనుచరులలో పధ్నాలుగు మందిని ఏరి, ''మీరు వెళ్ళి, శూర్పణఖ చెప్పే ముగ్గురినీ చంపి, వాళ్ళ రక్తం శూర్పణఖ కివ్వండి,'' అని ఆజ్ఞాపించాడు. వారు పధ్నాలుగురూ శూర్పణఖను వెంట బెట్టుకుని రాముడి పర్ణశాలకు వచ్చారు. శూర్పణఖ సీతా రామ లక్ష్మణులను వారికి చూపి, ''ఆ ముగ్గుర్నీ వెంటనే చంపెయ్యండి,'' అన్నది.



వారంతా ఆయుధాలతో సహా రావటం గమనించి రాముడు, లక్ష్మణుడితో, ''వాళ్ళ సంగతి నేను చూస్తాను. నువ్వు సీత వెంట ఉండు,'' అని చెప్పి, రాక్షసుల కెదురు వెళ్ళి, ''మీరంతా ఏమని నా మీదికి దండెత్తి వచ్చారు? ఇక్కడి మునులను రాక్షస బాధ నుంచి కాపాడతానని మాట ఇచ్చి ఈ ధనుర్బాణాలు వెంటపెట్టుకుని ఉన్నాను. నా చేతిలో చావాలని లేనట్టయితే వెంటనే పారిపొండి,'' అని చెప్పాడు.

రాక్షసులా మాటలు విని మండిపడి, ''నువ్వు మా దొర అయిన ఖరుడికి కోపం తెప్పించావు. నిన్ను చంపి పోవటానికే వచ్చాం. మేము చాలా మందిమి; నువ్వు ఒక్కడివి. నీకు చావు తప్పదు,'' అంటూ పధ్నాలుగు మందీ తమ చేతుల్లో ఉన్న శూలాలు రాముడి



పైన విసిరారు. రాముడు పధ్నాలుగు బాణాలతో ఆ శూలాలన్నిటినీ ఖండించి, వాటినే మళ్ళీ తీసుకుని వింటితో ఎక్కుపెట్టి పధ్నాలుగు మంది రాక్షసులనూ కొట్టాడు. అందరూ పడిపోయి ప్రాణాలు వదిలారు.

ఇది చూసిన శూర్పణఖ కంగారుపడి, పెద్దపెట్టున అరుస్తూ, పరిగెత్తి పోయి మళ్ళీ ఖరుడి సమీపాన కుప్పకూలిపోయింది. ఖరుడామెను చూసి చిరాకు పడుతూ, ''ఇంకా ఎందుకు ఏడ్చి, పార్లిగింతలు పెడుతున్నావు? ఇప్పుడే గద నీ పని చేసుకు రమ్మని పధ్నాలుగు మంది మెరికలలాటి వాళ్ళను పంపాను? వాళ్ళు అజేయులు. ఇక ఊరడిల్లు!'' అన్నాడు.

''నువ్వు పంపనూ పంపావు, వారంతా ఆ రాముడి చేత చావనూ చచ్చారు. నేను ఏడుస్తున్నానంటే, నాకు భయం ముంచుకొచ్చింది. ఆ రాముడు సామాన్యుడు కాడు. అతనూ, లక్ష్మణుడూ మహా పరాక్రమవంతులు. నా పగా, చచ్చినవాళ్ళ పగా తీర్చదలిస్తే నువ్వే వచ్చి ఆ రాముణ్ణి చంపు. ఆ పని చెయ్యక పొయ్యావో నీ శూరత్వం కేవలం దంభమే; అసలు నువ్వీ జనస్థానంలో ఉండటానికి కూడా అర్హుడవు కావన్న మాట. ఎందుకంటే ఎప్పటికైనా ఆ రాముడు వచ్చి నీ ప్రాణాలు తీసితీరుతాడు. కాదు, రాముడంతటి బలం నీకూ ఉన్నదంటావా, వెంటనే వచ్చి వాణ్ణి చంపు. చంపలేకపోతే వాడి చేతిలో చావనన్నా చావు!'' అంటూ శూర్పణఖ భోరున ఏడ్చింది.

శూర్పణఖ అందరు రాక్షసుల మధ్య తనను ఇలా అవమానించే సరికి ఖరుడికి పౌరుషం వచ్చింది. ''రాముడి పరాక్రమం నేను లెక్కచేస్తానా? నీకు జరిగిన అవమానం తలుచుకుంటే నాకు పట్టరాని కోపం వచ్చేస్తున్నది. ఆ రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ నేనే స్వయంగా నరికేస్తాను. నువ్వు వారి రక్తం తాగు,'' అన్నాడు ఖరుడు.

ఖరుడి వద్ద పధ్నాలుగు వేల మందితో కూడిన రాక్షస సేన ఉన్నది. దానికి నాయకుడు దూషణుడు. దూషణుడు ఆ సేనను ఆయత్తపరిచాడు. ఖరుడు రథమెక్కి, సేనతో సహా అట్టహాసంగా రాముడిపైకి యుద్ధానికి బయలుదేరాడు.

ఖరుడి వెంట పన్నెండు మంది రాక్షస ప్రముఖులూ, దూషణుడి వెంట మరి నలుగురు సేనాపతులూ ఉన్నారు.

తన పైకి ఒక పెద్ద రాక్షససేన వస్తున్నట్టు గ్రహించి, రాముడు సీతను లక్ష్మణుడి వెంట ఒక రహస్యమైన గుహకు పంపాడు. వారు వెళ్ళాక రాముడు దృఢమైన తన కవచం ధరించి విల్లంబులతో రాక్షసుల రాకను ఎదురుచూడసాగాడు.

ఇంతలో కోలాహలంగా అరుస్తూ, భేరులు మోగిస్తూ, అరణ్యమంతా మారుమోతలు వస్తూండగా, రాక్షస సైన్యం రానే వచ్చింది. రాముడికి ఎటు చూసినా రాక్షసులు కాన వచ్చారు. ఖరుడి రథం రాముడి వద్దకు, పర్ణ శాల సమీపానికి వచ్చింది. రాక్షసులు రాముడి మీద బాణవర్షం కురిపించారు. వాటిలో కొన్ని టిని రాముడు తన బాణాలతో కొట్టేశాడు. కాని రాక్షసులు ప్రయోగించిన అయుధాలు కొన్ని రాముణ్ణి గాయపరిచాయి. అయినా అతను పర్వతంలాగా ఏమాత్రం చలించక నిలబడ్డాడు. అయితే, రాముడు ప్రయో గించిన తీవ్రమైన బాణాలకు రాక్షసులు చావ నారంభించారు.

అనేకమంది రాక్షసులు రాముడి చేత చావగా కొందరు భయపడి ఖరుణ్ణి శరణు జొచ్చారు. దూషణుడు వారికి ధైర్యం చెప్పి తాను రాముడి పైకి వచ్చాడు. అలా వచ్చిన దూషణుడి పైనా, అతని వెంట వచ్చిన రాక్ష సుల పైనా రాముడు గాంధర్వాస్త్రం ప్రయోగిం చాడు. వేలకు వేలు బాణాలు వచ్చి రాక్షసు లకు తగిలి వారి ప్రాణాలు హరించాయి. రాముడికీ దూషణుడికీ యుద్ధమయింది. ఈ యుద్ధంలో రాముడు దూషణుడి సారథినీ,



గుర్రాలనూ, చివరకు దూషణుడి రెండు చేతులనూ బాణాలతో నరికేశాడు; దూషణుడి వెంట వచ్చిన అయిదు వేల మంది రాక్షసులనూ చంపేశాడు.

క్రమంగా రాముడు, తాను ఒంటరిగాడై ఉండికూడా, పధ్నాలుగు వేల మంది రాక్షసులనూ చంపేశాడు. వారిలో ఖరుడూ, త్రిశిరుడనే వాడూ మాత్రమే మిగిలారు. ఖరుడి ఆగ్రహానికి అంతు లేదు. అతడు రాముడి పైకి పోతూండటం చూసి త్రిశిరుడు అడ్డుపడి, ''రాముణ్ణినేను చంపుతాను. నువ్వు చూస్తూ ఉండు. ఒకవేళ రాముడే నన్ను చంపితే తరవాత నువ్వు అతన్ని చంపవచ్చు,'' అని బతిమాలాడు. ఖరుడు సరేనన్నాడు.

త్రిశిరుడికీ రాముడికీ చాలాసేపు భయంకరమైన యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో త్రిశిరుడు తన గుర్రాలనూ, సారథినీ, ధ్వజాన్నీ పోగొట్టుకుని, రొమ్మున బాణాలు తగిలి మూర్ఛపోయాడు. ఆ స్థితిలో రాముడు మూడు బాణాలు వేసి త్రిశిరుడి తల నరికేశాడు.

తరవాత రాముడికి ఖరుడితో యుద్ధం జరిగింది. ఖరుడు రాముడి చేతి బాణాన్ని విరగగొట్టటమే గాక, అతని కవచాన్ని ముక్కలు ముక్కలు చేసి, తన బాణాలతో ఛేదించాడు. రాముడు నిలువునా రక్తం కారుతూ, అగస్త్యుడిచ్చిన విల్లు తీసుకుని భయంకరమైన బాణాలు ప్రయోగించి ఖరుణ్ణి విరథుణ్ణి చేశాడు. ఖరుడు తన గదను రాముడి పైకి విసిరివేశాడు. అది రాముడి బాణాలతో తుత్తునియలు కాగా, సమీపంలో ఉన్న చెట్టును పెరికి, దాన్ని రాముడిపై వేశాడు. రాముడు దాన్ని కూడా తన బాణాలతో ఖండించి, ఖరుణ్ణి ఒక్క క్షణంలో చంపేశాడు.

రాముడిలా ఖర దూషణులనూ, పధ్నాలుగు వేల మంది రాక్షసులనూ చంపెయ్యటంతో దండకారణ్యానికి రాక్షస భయం తీరిపోయింది.

యుద్ధం అయిపోయినట్టు గ్రహించి, సీత గుహలో నుంచి బయటికి వచ్చి, రాముణ్ణి గట్టిగా ఆలింగనం చేసుకుని ఎంతో సంతోషం పొందింది.





# బంగారుమురుగులు

ఒక ఊళ్ళో రామయ్య అనే ఆయన ఉన్నాడు. ఆయనకు అరవై యేళ్ళు నిండాయి. ఆయన కొడుకు సుబ్బారాయుడు. అతని భార్య దుర్గాంబ. దుర్గాంబకు ఆంజనేయులు అనే తమ్ముడు ఒకడు ఉన్నాడు. వీరంతా ఒకే కుటుంబంగా జీవిస్తున్నారు.

రామయ్య చేతులకు నాలుగయిదు వందల విలువ చేసే బంగారు మురుగులు ఉన్నాయి. దుర్గాంబ ఎప్పుడూ వాటి వంక ఆశగా చూస్తూండేది. వాటి కోసమైనా తన కోడలు తన కింత గంజి పోస్తుంది లెమ్మని రామయ్య అనుకునేవాడు.

తండ్రి చనిపోయినాక వాటిని చెడగొట్టి, తన పెళ్ళాం ఇష్ట ప్రకారం నగలు చేయించాలని సుబ్బారాయుడు కూడా ఎదురు చూస్తున్నాడు.

ఒకనాడు రామయ్య మామూలు ప్రకారం సాయంత్రంవేళ పొలంలోని మామిడిచెట్టు కింద కూర్చుని, ఏదో ఆలోచనలో పడిపోయి చీకటి పడినదాకా ఇంటికి రావటం ఏమారాడు. చీకటి పడితే ఆయనకు బొత్తిగా చూపు ఆనదు. ఆలోచన కట్టిపెట్టి ఆయన చుట్టూ కలయజూసి కంగారుపడ్డాడు.

''ఎవర్రా? దగ్గిరలో ఎవరన్నా ఉన్నారా?'' అని ఆయన కేకపెట్టాడు, ఎవరైనా సాయంగా వచ్చి తనను ఇంటికి చేరుస్తారని.

కొంచెం దూరంగా పొలంలో పని చేసుకుంటున్న ఆంజనేయులు ముసలాయన పెట్టిన కేక విని, ఆయన పరిస్థితి అర్థం చేసుకుని, దగ్గిరికి వచ్చి, కొడవలి ఆయన పీకకు పెట్టి, మారు గొంతుకతో, ''మురుగులు ఇచ్చెయ్యి!'' అన్నాడు.

చేసేది లేక, రామయ్య తన మురుగులు తీసి ఆంజనేయులుకు ఇచ్చాడు. వాటిని తీసుకుని ఆంజనేయులు వెళ్ళిపోయాడు. తరవాత ఎలాగో రామయ్య ఇంటికి చేరాడు.



రామయ్య వద్ద నుంచి మురుగులు కాజేసిన ఆంజనేయులు స్వర్ణకారుడు కనకరాజు దగ్గిరికి వెళ్ళి, ''నీకు సగం వాటా ఇస్తాను. ఈ బంగారం అమ్మి పెట్టు,'' అన్నాడు. అతడు సరేనన్నాడు.

పొద్దుపోయి ఇల్లు చేరిన మామగారి చేతులు బోడిగా ఉండటం చూసి, దుర్గాంబ ఉండబట్టలేక, మురుగులు ఏవీ అని అడిగింది.

''నీకు నగలు చెయ్యమని స్వర్ణకారుడికి ఇచ్చాను,'' అన్నాడు రామయ్య సమయస్ఫూర్తితో. దుర్గాంబ సంతోషపడి, తమ కోసం ప్రత్యేకంగా చేసుకున్న వంటకాలు కూడా ఆ రాత్రి మామగారికి వడ్డించింది.

కనకరాజు అర్ధరాత్రి అయినా ఏదో పని చేస్తూండటం గమనించి, అతని భార్య మీనాక్షి లేచి వచ్చి, ఇంత పొద్దుపోయి ఏం చేస్తున్నావని అడిగింది. భార్యను చూసి కంగారుపడి కనకరాజు చెయ్యి కాల్చుకుని, పోయి పడుకోమని ఆమెను కసిరాడు. ఆమెకు అనుమానం వేసింది, అయినా వెళ్ళి పడుకున్నది.

దుర్గాంబ కోడికూయక ముందే లేచి కనకరాజు ఇంటికి పరుగు తీసింది. కనకరాజు ఇంట్లో లేడు, కాలవగట్టుకు వెళ్ళాడు.

''మా మామగారు బంగారు మురుగులు చెడగొట్టి నాకు నగలు చెయ్యమని ఇచ్చారట. నాకు ఫలానా ఫలానా నగలు కావాలి. మీ ఆయన రాగానే ఒకసారి వచ్చి, నాతో మాట్లాడమని చెప్పు,'' అని మీనాక్షికి చెప్పి, దుర్గాంబ ఇంటికి తిరిగి వచ్చింది.

కనకరాజు ఇంటికి రాగానే మీనాక్షి అతనితో దుర్గాంబ చెప్పమన్నట్టు చెప్పింది. అతను మొదట ఆశ్చర్యపడి, ''ఆ సరుకు వారిది కాదులే,'' అని తన భార్యకు నచ్చచెప్పాడు.

తాను స్వర్ణకారుడి ఇంటికి వెళ్ళివచ్చిన సంగతి ఇంట్లో అందరి ముందూ దుర్గాంబ చెప్పింది. రామయ్య కూడా ఎంతగానో ఆశ్చర్యపోయాడు. కాని, ఇద్దరూ బయట పడలేదు.

ఆతరవాత వీలు చూసుకుని ఆంజనేయులు కనకరాజు వద్దకు వెళ్ళి, మురుగుల ప్రసక్తి తెచ్చాడు. గుడినీ, గుళ్ళో లింగాన్నీ కూడా మింగగల కనకరాజు, ''ఏం మురుగులు? నువ్వు నా కేమీ ఇయ్యలేదు. కావలిస్తే న్యాయస్థానానికి వెళ్ళు,'' అన్నాడు.

అప్పటికి అతనికి ఆ మురుగులు రామయ్యా వన్న సంగతి కూడా తెలిసింది.

ఈ మాటకు ఆంజనేయులు తెల్లబోయి, తాను దొంగ అన్న సంగతి రుజువు చేసుకో లేక, చేసిన దానికి పశ్చాత్తాపపడుతూ, ఇంటి దారి పట్టాడు.

రామయ్య మాత్రం రహస్యంగా తన కొడుకుతో, తన మురుగులు క్రితం సాయం కాలం ఎవరో బలాత్కారంగా తీసుకున్నారనీ, చూపు ఆనక తాను ఆ మనిషిని గుర్తుపట్టలేక పోయినాననీ చెప్పాడు.

ఈ మాట చెవిని పడిన అనంతరం సుబ్బా రాయుడు, తన బావమరిది ఆంజనేయులు స్వర్ణకారుడి ఇంటికి వెళ్ళి రావటం ఒక కంట కనిపెట్టాడు.

ఆంజనేయులు వచ్చి కనకరాజుతో మాట్లా డేటప్పుడు తలుపు చాటున పొంచి ఉండి, కనకరాజు భార్య మీనాక్షి అంతా విని, సంగతి గ్రహించింది. పుట్టింటి వారు మీనాక్షికి ఏమీ పెట్టలేదని కనకరాజు ఎప్పుడూ సాధించే వాడు. ఆ సాధింపులు వినలేకపోయేది మీనాక్షి. కిందటి రాత్రి తన భర్త కరిగించిన బంగారం తాను కాజేసి, తన పుట్టింటి వారికిచ్చి నగలు చేయించి తెచ్చుకుంటే తన భర్త సాధింపులు కట్టుపడతాయని ఆమె అనుకున్నది. భర్త అలా బయటికి వెళ్ళగానే మీనాక్షి బంగారం సంగ్రహించి తన బొడ్డులో దాచుకున్నది.

బయటి పని ముగించుకుని ఇంటికి తిరిగి వచ్చి, కనకరాజు, బంగారం కనపడక పోయేసరికి, తన పెళ్ళాం మీద ఎగిరిపడ్డాడు.



తనకు దాని ఊసే తెలియదని ప్రమాణాలు చేసింది మీనాక్షి.

కనకరాజు తనకు చేసిన మోసానికి, అతన్ని చంపి కసి తీర్చుకోవాలని ఆంజనేయులు అర్ధరాత్రివేళ కనకరాజు ఇంటికి వచ్చి, ఇంటి బయట గల చెట్లలో ఒకదాని చాటున పొంచి, అవకాశం కోసం చూస్తూ నిలబడ్డాడు.

మురుగుల విషయంలో ఆంజనేయు లుకూ, కనకరాజుకూ ఏదో సంబంధం ఉందని అనుమానించిన సుబ్బారాయుడు, ఆంజనేయులును వెయ్యి కళ్ళతో కని పెడుతూ ఉండి, అతని వెనకనే తాను కూడా వచ్చి, ఒక పొద చాటున దాగి ఆంజనేయులు మీదనే దృష్టి ఉంచాడు.

ఇంట్లో ఉన్న బంగారం ఇంట్లోనే మాయ మయిందంటే అది భార్య పనే అనుకుని,

నిద్రపోతున్నట్టు నటించి, పెళ్ళాన్ని కనిపెట్ట సాగాడు కనకరాజు.

బంగారం తన వద్దనే ఉండటం మంచిది కాదనుకుని మీనాక్షి చెంబుతో నీళ్ళు పట్టుకుని, ఇంటి నుంచి బయటికి వచ్చి, ఊరు చివరకు బయలుదేరింది. దొంగనిద్ర నటిస్తున్న కనకరాజు ఆమె వెనకనే బయలుదేరాడు.

వాళ్ళిద్దరినీ చూసి, వాళ్ళు ఎక్కడికి పోతున్నదీ అర్థంగాక, ఆంజనేయులు కనకరాజు వెనకగా తాను కూడా బయలుదేరాడు. ఆంజనేయులు వెనకగా సుబ్బారాయుడు కూడా బయలుదేరాడు.

ఈ నలుగురిలో ఎవరికీ తమ వెనక ఎవరో వస్తున్న సంగతి తెలియదు. మీనాక్షి తాను ఒంటరిగా పోతున్నాననే అనుకున్నది. కనకరాజు తన భార్యను తాను ఒక్కడే అనుసరిస్తున్నాననుకున్నాడు. అలాగే ఆంజనేయులుకు తన ముందున్న ఇద్దరూ తెలుసుగాని, తన వెనక వస్తున్న సుబ్బారాయుడి సంగతి తెలీదు.

ఈ నలుగురూ పిల్లల లాగా ఒకరి వెనకగా ఒకరు పోతూండటం వీధిలో అరుగు మీద నిద్రపోతున్నట్టు పడుకుని ఉన్న ఒక వ్యక్తి గమనించి, సుబ్బారాయుడి వెనకగా ఎవరూ లేకపోవటం చూసి, తాను అతని వెంట బయలుదేరాడు.

మీనాక్షి ఊరి చివర పాడుబడ్డ దేవాలయం దగ్గిర ఆగి, అక్కడ చిన్న గుంటలో బంగారం ఉంచి, దాని మీద ఇంత మట్టి కప్పి, ఇంటికి వెళ్ళిపోయింది.

వెంటనే మిగిలిన ముగ్గురూ ఆ గుంట మీదికి ఒక్కసారిగా దూకి, దాని కోసం తన్నుకోసాగారు.

ఇంతలో, ''ఆగండి!'' అని వెనక వచ్చిన మనిషి గట్టిగా గర్జించాడు.

ముగ్గురూ వెనక్కి తిరిగిచూసి, ఆ కేక పెట్టినది ఆ ఊరి రాజు అని గ్రహించి, ఆయన కాళ్ళమీద పడ్డారు. రాజు వాళ్ళ కథ అంతా విని, బంగారాన్ని దొంగిలించినందుకు ఆంజనేయులునూ, తోడుదొంగ అయి, నమ్మక ద్రోహం చేసినందుకు కనకరాజునూ శిక్షించి, బంగారాన్ని రామయ్యకు తిరిగి ఇప్పించాడు. కాలక్రమాన దుర్గాంబ ఆ బంగారంతో నగలు చేయించుకున్నది.



చిత్రాలు: గాంధి అయ్య **17**

# అజేయుడు గరుడుడు!



ఆదిత్యుడు క్షేమంగా ఆలయ ప్రాంగణానికి చేరుకున్న విషయాన్ని వీరబాహు, మహారాజుకు తెలియజేశాడు. అరుణ గదిలో కనిపించిన నీడలాంటి రూపం గురించి, చెలికత్తె వచ్చి మహారాజుకూ, వీరబాహుకూ చెప్పింది. ఇద్దరూ అరుణ వద్దకు బయలుదేరారు.

మహారాజూ, వీరబాహూ అరుణ పడుకున్న గదిలోకి వెళ్ళారు.













ఆయన పేరు విద్యాధరుడు. ఆయన ఒకనాడు హిమాలయాలలో తిరుగుతూండగా కైలాసగిరి వైపునుంచి తేలుతూ వచ్చిన ఒక ఈక నేలమీద పడడం చూశాడు.


ఆయన దానిని భక్తితో తీసి కళ్ళకద్దుకుని, తన గుహకు తీసుకుపోయాడు.


అది గరుడుడి ఈక అని ధ్యానం ద్వారా గ్రహించాడు.


దీనిని జాగ్రత్తగా పరిరక్షించగలవారికే దీనిని అప్పగించాలి అని ఆలోచించాడు...


ఆయన తన ఒకనాటి శిష్యుడూ, ఆధ్యాత్మికచింతన కలవాడూ అయిన వీరకేసరి వద్దకు వెళ్ళాడు. ఆయన ఆదేశానుసారం...


వీరకేసరి ఆ ఈకను ఒక బంగారు పేటికలో భద్రపరచి విష్ణువిగ్రహం ముందు ఉంచాడు.


వీరకేసరి తీర్థయాత్రలకు బయలుదేరి
వెళ్ళాడు. ఆ సమయంలోనే రాజు
మరణించడంతో, కుమారుల మధ్య
సింహాసనం కోసం గొడవలు
ఆరంభమయ్యాయి. రాజ్యాన్ని
విభజించుకుని రాకుమారులు స్వతంత్ర
రాజులయ్యారు.




సూర్యపురి, వజ్రపురి
రాజులు ఎప్పుడు
చూసినా ఒకరితో
ఒకరు వైరంతో
పోరాడుతూ
ఉండేవారు. అదృష్ట
వశాత్తు చంద్రపురిలో
మాత్రం శాంతియుత
పాలన నెలకొన్నది.


తీర్థయాత్రల నుంచి తిరిగి వస్తున్న వీరకేసరి
ఒక నదిని దాటవలసి వచ్చింది. ఆ నదీ
తీరంలో అతను బంగారు పేటిక ఉండడం
చూసి ఆశ్చర్యపోయాడు.


ఆయన దానిని భక్తితో తెరిచి
చూశాడు...


ఆయన సాధువు విద్యాధరుడి వద్దకు తిరిగి వెళ్ళాడు. విద్యాధరుడు ఆయనకు రాజ్యం గురించి చెప్పి, చంద్రపురికి వెళ్ళి శంఖను పూజించమని ఆదేశించాడు...
అందులో శంఖ భద్రంగా ఉన్నది.


వీరసేన ఆ శంఖను తన కుమారుడికి అప్పగించాడు...


ఆయన దాన్ని కొన్నేళ్ళకు తన కుమారుడికి అప్పగించాడు. ఉత్తరోత్తరా ఆయనే ప్రధానమంత్రి అయ్యాడు.


ఆయన కుమారుడు ఆదిత్యుడు ఒక


మన రాజగురువుకు విష్ణుపురిలోని శిథిల ఆలయం స్వప్నంలో కనిపించింది. ఆయనే దానిని పునరుద్ధరించమని చెప్పాడు. దానిని పునరుద్ధరించగల సమర్థుడు ఆదిత్యుడు మాత్రమే అని కూడా ఆయన సెలవిచ్చాడు.


ఆదిత్యుడు ఆలయం వద్ద క్షేమంగా ఉన్నట్టు సమాచారం అందింది.
ఆదిత్యుడు త్వరగా తిరిగి రావాలని ఆశిస్తున్నాను.
వీరబాహూ, అరుణ కోలుకుని చక్కగా ఉందని ఆదిత్యుడికి


బయలుదేరుదాం అరుణా. వివాహానికీ, పట్టాభిషేకానికీ కొత్త ముహూర్తాలతో మన ఆస్థాన జ్యోతిష్కుడు రావచ్చు.

మన సాంస్కృతిక ఉత్సవాలు

# ఆజ్మీర్ ఉర్స్



ఖ్వాజా మొహినుద్దీన్ చిస్తీ ముస్లిం సాధువులలో సుప్రసిద్ధుడు, అందరి మన్ననలూ పొందిన మహనీయుడు. రాజస్థాన్‌లోని ఆజ్మీర్‌లో ఆయన మసీదు ఉంది. మనదేశంలోని సుప్రసిద్ధమైన మసీదులలో ఇది ఒకటి. ముస్లిం మాసం రజాబ్ తొలిరోజునుంచి ఆరు రోజుల పాటు ఆ మహనీయుడి 'ఉర్స్' ఉత్సవం జరుపుతారు. వేలాదిమంది భక్తులు ఈ ఉత్సవానికి హాజరవుతారు.

మొహినుద్దీన్ 1135వ సం. ఆఫ్ఘనిస్తాన్‌లో జన్మించాడు. ఆయన మహమ్మద్ ప్రవక్త అల్లుడైన అలీ వంశానికి చెందినవాడని చెబుతారు. ఆయన తొమ్మిదవ యేటే పవిత్ర ఖురానును వల్లించడం నేర్చుకున్నాడు. 1190లో మదీనా యాత్ర చేశాడు. ఆయన అక్కడ ఉన్నప్పుడు మహమ్మద్ ప్రవక్త కలలో దర్శనమిచ్చి-నాటి పృథ్వీరాజు రాజధానీ నగరమైన ఆజ్మీరుకు వెళ్ళమని ఆజ్ఞాపించాడట. మొహినుద్దీన్ తన శిష్యులతో అక్కడికి వచ్చి ఒక తోటలో విడిది చేశాడు. అది పృథ్వీరాజు సైన్యంలోని ఒంటెలు విశ్రాంతి తీసుకునే స్థలం. అందువల్ల ఆయనన్ను, శిష్యులను అక్కడ విడిది చేయడానికి రాజభటులు ఆక్షేపించారు. ఆనాటి రాత్రి పడుకున్న అక్కడి ఒంటెలు, తెల్లవారాక పైకి లేవలేకపోయాయి. ఒంటెలు కాచేవాళ్ళు, పృథ్వీరాజు వద్దకు వెళ్ళి సంగతి చెప్పారు. ఆయన వాళ్ళ ద్వారా మొహినుద్దీన్‌కు క్షమాపణలు తెలియజేయడంతో, ఒంటెలు లేచి నిలబడి నడవసాగాయట!

పృథ్వీరాజును ఓడించిన మహమ్మద్ ఘోరీ, మొహినుద్దీన్‌ను ఆజ్మీరులోనే ఉండడానికి అనుమతించాడు. మొహినుద్దీన్ ప్రసంగాలు వినడానికి ధనిక, పేద భేదాలు లేకుండా అన్ని మతస్థులూ ఆజ్మీరుకు తండోప తండాలుగా తరలివచ్చేవారు. 1229 రజాబ్‌లో ఆయన కాలధర్మం చెందాడు. ఆజ్మీరులోని ఆయన మసీదు యాత్రాస్థలంగా మారింది. ఉర్స్ సమయంలో మొగల్ చక్రవర్తులు ఆజ్మీరుకు వచ్చేవారని చెబుతారు. యాత్రీకులకు వంట చేయడానికి అక్బర్, జహంగీరులు ఇచ్చిన రెండు పెద్ద పెద్ద ఇత్తడి పాత్రలు ఇంకా ఉన్నాయి. ఇప్పటికీ వాటిని ఉపయోగిస్తున్నారు.

## విజ్ఞాన వీచికలు :



### క్లోమం

కడుపు దిగువ భాగం వెనక 8 అంగుళాల పొడవు $1^1/_2$ అంగుళాల వెడల్పుతో అడ్డంగా ఉన్న గ్రంధి క్లోమం. ఆరంభ భాగం చిన్నప్రేవుల డయోడినం అంటే ఆంత్ర మూలం గోడకు అనుకుని ఉంటోంది.

ఇది ఎక్సోక్రైన్, ఎండోక్రైన్ అనే రెండు రకాల కండరాలతో తయారైనది. ఈ కండరాలు రక్తంలోకి ఎన్‌జైములను, హార్మోనులను స్రవిస్తాయి.

క్లోమం జీర్ణక్రియ, సమన్వయం అనే రెండు పనులను చేస్తుంది. ఎక్సోక్రైన్ కండరాలు జీర్ణక్రియ ఎన్‌జైములను, ఎండోక్రైన్ కండరాలు హార్మోనులను స్రవిస్తాయి. ఎక్సోక్రైన్ హార్మోనులు డయోడినమ్‌లోని ఆహారంలోని కార్బోహైడ్రైట్లు, కొవ్వుపదార్థాలు, ప్రోటీన్లుగా విడగొట్టడానికి ఉపయోగపడతాయి. ఈ హార్మోనులు డయోడినమ్‌లో చేరేంతవరకు పనిచేయవు. ఎక్సోక్రైన్ కండరాలు బైకార్బొనేట్‌ను స్రవించి కడుపులోని ఆమ్లాల చర్యలను క్రమబద్ధం చేయడానికి దోహదపడతాయి.

పాంక్రిటిస్ ద్వారా క్లోమం దెబ్బతింటుంది. ఇది వాపుకూ, జీర్ణక్రియ దెబ్బతినడానికీ దారితీస్తుంది. కేన్సర్ కారణంగా కూడా క్లోమం దెబ్బతింటుంది.

## మన పరిసరాలు

### రంగులేని పగడాలు



పగడాలు అనగానే మనకు అందమైన రంగులు గుర్తుకు వస్తాయి. అయినా పగడాలకు సొంత రంగు అంటూ ఉండదు. అలా అయితే పగడాల రంగు భ్రమ మాత్రమేనా? అంటే, అదీ కాదు. పగడాలలోని ఏక కణ ఆల్గీ (నాచు) కారణంగా వాటికి రంగు ఏర్పడుతుంది.

పగడాలకూ, నాచుకూ ఉన్న సంబంధం చాలా ఆసక్తికరమైనది. నాచు ఉండడం వల్ల పగడాలు సున్నపు రాయిని ఉమ్మడం త్వరిత గతిలో సాగుతుంది. దాంతో ఆల్గీ పగడాల అస్థిపంజరాలలో, రక్షణతో హాయిగా నివసిస్తాయి. చనిపోయిన పగడాల దిబ్బలలో సజీవ ఆల్గీలు ఉండవు. అవన్నీ చనిపోయిన సున్నపురాయి ముద్దలు. అందువల్ల అవి బూడిద రంగులో ఉంటాయి.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మీకు తెలుసా?



### పేరాశగల పక్షి

'సిడార్ వాక్స్‌వింగ్' చాలా అందంగా పాడే పక్షి. అది చాలా పేరాశ కలదని చెబుతారు. ఎందుకో తెలుసా? అది పాట వినిపించినందుకు మన వద్ద డబ్బు వసూలు చేస్తుందనుకున్నారా? అదేం కాదు. మరెందుకు? సిడార్ బెరీస్ (దేవదారు పళ్ళు) అంటే దానికి మహా ఇష్టం. అది వాటిని తినే బతుకుతుంది. అయినా వాటిని కదలలేనంత ఎక్కువగా తినేస్తుంది.

## మన దేశం క్విజ్

మనదేశంలో రకరకాల జంతువులు, పక్షులు, చెట్లు ఉన్నాయి. వాటిలో కొన్ని ప్రత్యేకమైనవి కూడా. వాటిని గురించి మీకెంత మాత్రం తెలుసో ఈ చిన్న క్విజ్ ద్వారా తెలుసుకోండి!

1. మర్రి వృక్షం, మన దేశానికే ప్రత్యేకమైనది. దీనిని ఇంగ్లీషులో 'బాన్యన్' అంటారు. దానికా పేరు ఎలా వచ్చిందో తెలుసా?



2. మన దేశంలో నాలుగు రకాల తాడి జాతి చెట్లున్నాయి. అవి ఎవి?
3. ఘానా అన్నది దక్షిణ ఆఫ్రికాలోని ఒక దేశం. మన దేశంలో ఘానా పక్షుల శరణాలయం ఎక్కడ ఉందో తెలుసా?
4. ఏనుగు దంతాలలాగే, జింకల కస్తూరి చాలా విలువైనది. మన దేశంలో కస్తూరి జింకలు ఎక్కడున్నాయి? ఆ జంతువుల శరీరంలో కస్తూరి ఏ భాగంలో ఉంటుంది?



5. ఆసియా సింహాలకు గుజరాత్‌లోని గిర్ వన్య మృగ అభయారణ్యం సహజ నివాసస్థలం. మరి మనదేశంలో సింహాల రెండవ అభయారణ్యం ఎక్కడ ఉన్నది?

(సమాధానాలు 66వ పేజీలో)

### చందమామ ఇండియా క్విజ్ - 3 (ఏప్రిల్ '07) విజేతలకు అభినందనలు

1. ఎ. శ్రీరామ్, విజయనగరం - 535 001 (ఆం.ప్ర)
2. యం. యస్. తేజస్విని, మదనపల్లె - 517 325, చిత్తూరు జిల్లా (ఆం.ప్ర)
3. సంగీత దాస్, విశాఖపట్నం - 530 016 (ఆం.ప్ర)
4. బి. సుధీర్ వర్మ, నరసన్నపేట - 532 421, శ్రీకాకుళం జిల్లా (ఆం.ప్ర)

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



K.S. GANAPATHI RAMAN



K.S. GANAPATHI RAMAN



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఆగస్ట్ 2007 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్‌ఆఫీసర్స్‌కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 032.

## అభినందనలు

ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు
శ్రీమతి వరగాని సీత
కేరాఫ్ జవహర్ పిల్లల వైద్యశాల
నిమ్మతోట,
నర్సరావుపేట - 522 601
గుంటూరు జిల్లా (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : జారితే ప్రమాదం!
రెండవ ఫోటో : జాగ్రత్త చెల్లీ!

## సమాధానాలు :

1. భారతీయ వ్యాపారులు (బనియాలు) దానిని ప్రతి ఉదయం పూజించడం యూరోపియన్లు మొదట చూశారు. ఆ బనియాల మీదుగా దానికి 'బాన్యన్' అని పేరుపెట్టారు 2. కొబ్బరి, తాడి, పోక, ఖర్జూరం 3. రాజస్థాన్‌లోని భరత్‌పూర్‌లో 4. కాశ్మీరులో. పొత్తికడుపు దిగువ 5. ఉత్తర ప్రదేశ్‌లోని చంద్రప్రభ అభయారణ్యం.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)




# చమురు ఉపయోగాలు



కిరోసిన్, పెట్రోల్, డీజెల్, లూబ్రికెంట్స్ అంటూ చమురు మీకు రకరకాలుగా ఉపయోగపడుతోంది. రోజూ తమ పనులు చేసుకోవడానికి ఏదో ఒక విధంగా చమురు మీద ఆధారపడని వారంటూ ఎవరుంటారు?





దాదాపు 50 శాతం మంది గృహస్థులు, వంటగదులలో సిలిండర్ల రూపంలోనో, పైప్‌లైన్ సప్లై ద్వారానో ఎల్‌పిజి (లిక్విఫైడ్ పెట్రోలియం గ్యాస్)ని ఉపయోగిస్తున్నారు. మిగిలినవారు ముఖ్యంగా గుడిసెల్లో నివసించే పేదవాళ్ళు వంటకు కిరోసిన్ స్టవ్ ఉపయోగిస్తారు. కిరోసిన్‌ను ఉపయోగించే హరికేన్ లాంథర్లు, 'పెట్రోమాక్స్' దీపాలు ఇళ్ళల్లోనూ, షాపుల్లోనూ ఒకప్పుడు మామూలుగా కనిపించేవి.



మోటారు బైకుల వంటి ద్విచక్రవాహనాలు, ఆటో రిక్షాలు, డెలివరీ వ్యాన్స్ వంటి త్రిచక్ర వాహనాలు; కార్లు, ట్రక్కులు వంటి నాలుగు చక్రాల వాహనాలు పెట్రోలుతోగానీ, డీజెల్‌తోగానీ నడుస్తాయి. ఓడలలో, రైలు బళ్ళలో ఇంజిన్లు ఇవాళ డీజెల్‌తో నడుస్తున్నాయి.

నిజానికి మనుషులు, యంత్రాలు రెండూ కూడా చాలా వరకు చమురు మీద ఆధారపడడం అనివార్యమవుతోంది. జీవితంలోని వివిధ పార్శ్వాలు సులువుగా, సుఖంగా సాగడానికి చమురునైన నేను ఎంతో అవసరమవుతున్నాను. అయితే, చమురును ఉపయోగించే కొందరు నిర్లక్ష్యం కారణంగా చాలా వృథా చేస్తూ ఉంటారు. ఈ వృథాను గనక అరికట్టినట్టయితే చమురునైన నేను మీ సేవలో పదికాలాల పాటు కొనసాగగలను.

CHANDAMAMA (Telugu) June 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08






















